మీ చిన్న మొత్తములను దాచుట ద్వారా పెద్ద పెద్ద కార్యాలను సాధింపగలరు

నేషనల్ సేవింగ్స్‌లో
పెట్టుబడి పెట్టండి











AMRUTANJAN
The Pain Balm
Amrutanjan Limited
BOMBAY, MADRAS



వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

సంపుటము 25] సెప్టెంబరు 1956 [సంచిక 9

# వి ష య సూ చి క

—(౦)—



ముఖచిత్రం : By Courtesy of "Lokavani"



గురువాయూర్‌లో వివాహితులయిన శ్రీ కేసరిగారి కుమార్తె శ్రీ వసంతకుమారి, భర్త శ్రీ నారాయణ మీనన్.
వివాహానంతరము మద్రాసుకు ప్రప్రథమంగా వచ్చినప్పటి విందునాటి ఛాయా చిత్రము




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ఆహార పదార్థముల ధరల పెరుగుదల

నిత్యావసరములలో శరవేగంగా ధరలు పెరుగుచున్నవి ఆహార పదార్థములు ఒకటి. ధరల పెరుగుదలకు కారణములు ఆహార పదార్థముల ఉత్పత్తి తగ్గుదలవలననా లేక ఆహార పదార్థముల లోటువలననా అనేది సామాన్య మానవుని ప్రశ్న.

తమ నిత్యావసరాలకు సరిపడే ఆదాయం లేక కొందరు, చాకిరి చేద్దామన్నా చేయించుకొని జీవనోపాధి కల్పించే అవకాశములులేక అనేకులు అలమటిస్తుంటే నిత్యావసరాలలాంటి కూడు, గుడ్డల ధరలు పెరుగుదల సామాన్య ప్రజానీకపు జీవితమును మరింత దుర్భరము చేయుచున్నది.

ఆహార ధాన్యాలు ముఖ్యంగా బియ్యం ధర పెరుగుదలకు నిల్వలు తగ్గిపోయి కాదనియు, ఉత్పత్తి సయితము అభివృద్ధి దశలో నున్నదని లెక్కలు తెలుపుతుండగా మరి ధరల పెరుగుదలకు స్వార్థము నుద్దేశించి ప్రజా క్షేమమును గుర్తించకుండా అవకాశములను వ్యాపారస్తులు, ఉత్పత్తిదారులు దుర్వినియోగం చేయడమే ననకతప్పదు.

ఉత్పత్తిదారులు, వ్యాపారస్తులు నష్టపడవలసినదిగా ప్రజానీకం కోరదుగాని పరిమితమయిన లాభములతో అధిక లాభాలకు ప్రాకులాడకుండా జీవన ప్రమాణమున కనుగుణ్యంగా సాధ్యమైనంతవరకు జాతీయ శ్రేయస్సుకు ఉత్పత్తిదారులు, వ్యాపారులు తోడ్పడాలి.

ధరల పెరుగుదల నరికట్టుటకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు వాస్తవికత కనుగుణ్యంగా వ్యవహరించి తీరాలి. ఆహార పదార్థాల ధరల నదుపులో నుంచుట కవసరమయితే విదేశాలనుండి ధాన్యాల దిగుమతిచేయుటగాని, ఉన్న అవకాశాలను న్యాయంగా ప్రజలకు సమకూర్చుటగాని ప్రభుత్వ ధర్మము.

ప్రజల నిత్యావసరాలలాంటి ఆహార పదార్థములు, గుడ్డలు వర్తక వ్యాపారాల అభివృద్ధి దృష్ట్యా యితర దేశముల నెగుమతి చేసేముందు ప్రజల అవసరాలు తీరిన తరువాత మిగిలియున్న వానినే ఎగుమతి చేయాలి. వర్తక వ్యాపారములు జాతీయ సంపద నభివృద్ధిచేయుననునది నిజమేకాని, స్వీయ ప్రజల నిత్యావసరాలు మాత్రం అలక్ష్యము చేయతగనివి.

---

## పెళ్లిళ్లలో బోగం మేళాల నిషేధం

పెళ్లిళ్లలోగాని, పబ్లిక్ వీధులలో జరిగే యితర యూరేగింపులలోగాని స్త్రీలు నృత్యముచేయడాన్ని నిషేధించే బిల్లును ఆంధ్ర అసెంబ్లీ ఆమోదించడము సంతోషింపతగిన విషయము.

స్త్రీలకు సంఘములో గౌరవ ప్రతిపత్తులను కాపాడి వారిపట్ల గౌరవ మర్యాదలను చూపడానికి ఉద్దేశించిన యీ బిల్లు చట్టంగా రూపొందిన విషయము ప్రజానీకం గుర్తించగలదనే మా విశ్వాసము.

ప్రజలలో కళా వికాసము పెంపొందుటకు, కళారాధకులకు, కళాకారులకు తమ ప్రావీణ్యమును ప్రదర్శించుట కనువుగా కళాకేంద్రాలు విరివిగా నేర్పడి కళలు ప్రజాసామాన్యానికి అందుబాటులో నుండేలాగ సయితం అవకాశాలను ప్రభుత్వము, ప్రజలు ఏర్పాటు చేసికొనవలసి యుండును.

# తెల్లరోజా!

రచయిత్రి :
ఇన్ గే షోల్

అనుసరణ :
డాక్టరు వి. ఎస్. శర్మ

రెండో భాగం

## "తెల్లరోజా కరపత్రం" తెచ్చిన ఆవేశం!

జర్మను జాతిని గురించి, ఆ జాతికి లోక సంస్కృతిలో వుండాలసిన అగ్రస్థానాన్ని గురించీ కరపత్రంలో సూచింపబడ్డ యోగ్యత వివరాలనూగురించి సోఫీ చదివాక ఆపిల్ల ఎంతనిర్ఘాంతపడిపోయిందో ఇక చెప్పాలా? ఆ కరపత్రాన్ని తయారు చేసినవాళ్ళు సాహసవంతులయి వుండాలి! వాళ్ళ ఆదర్శాల్ని నిలువబెట్టుకోనటానికి ఎట్టికష్టాలు వచ్చినా వాటిని ఆనందపూర్వకంగా అనుభవించటానికి సంసిద్ధులయి వుండాలి! ఈ రోజులు చెడ్డరోజులు. గూఢచారులు ప్రతిచోటా వున్నారు. వెయ్యికళ్ళతో అస్తమానమూ ఇంట్లో, బయటా జరుగుతూవున్న దృశ్యాల్ని చూస్తూవుంటారు. గోడలకి చెవులున్నాయి. ఇటూ అటూ ఎంత మెల్లగా మాట్లాడుకుంటూవున్నా ఆ మాటామంతిని అతి సులభంగా వినటానికి వాళ్ళకి తెలివితేటలు వున్నాయి. అట్టి విషమపరిస్థితుల్లో ఇలాంటి కరపత్రాన్ని ఎవరు వ్రాసివుంటారు? అలా వ్రాయటానికి వాళ్ళు ఎన్నెన్నో పుస్తకాలని చదివివుండాలి. ఆ పుస్తకాలు వ్రాసిన రచయితల పంథాలోనే ఈ సంగతులను వ్రాయటానికి ఎంతోధైర్యాన్ని చూపాలిగా? సోఫీ ఇలా తలపోయసాగింది. చెప్పాలసిన విషయాన్ని ఎంత చక్కగా ఆ రచయితలు ఈ కరపత్రంలో చిత్రించారు. కరపత్రంలోని ఒకభాగాన్ని చదవటం పూర్తిచేసింది. నలుప్రక్కలా జాగ్రత్తతో కలయ చూసింది. అక్కడ ఎవళ్ళూ లేరు. ఆ సమయంలో ఎవళ్ళూ ఆపరిసరాల్లో వుండకుండా వుండడం మంచిదని సంతోషించింది సోఫీ రెండోభాగాన్ని చదవటానికి ప్రారంభించింది!

"ఇలామనం ఈ విషమావస్థలో వుదాసీనభావంతో మెలగితిమా ఇంతవరకు లోకచరిత్రలో అగ్రస్థానం వహించి, ఇతరులకు నాగరికతలో, సంస్కృతిలో చక్కని రాజమార్గాన్ని చూపి ధన్యతగాంచిన జర్మను జాతి అధఃపతనానికి పోతుంది. మన జాతిపేరు ప్రతిష్ఠలకే చెప్పరానంత కళంకానికి తెచ్చినవారమైపోతాము. అటువంటి దౌర్భాగ్యదశలోకే వచ్చామా ఇక మిగిలేది అప్రతిష్ఠ! నాశనం! భీభత్సం! ...ఇది మన చరిత్రలో చెప్పరానంత ఆపత్కాలం! ఇట్టి ఆపత్కాలాన్ని జర్మనుజాతి ఇంతవరకు ఏ యుగంలోగాని ఎదుర్కొన్నదికాదు... ఈ జర్మను జాతిలో పుట్టి పెరుగుతూవున్న పిన్నలూ పెద్దలూ, స్త్రీలూ పురుషులూ, ఈ రహస్యాన్ని అవగాహనం చేసుకోనాలి. అంటే ప్రతి వ్యక్తి, ఈ ఆపత్కాలాన తన ధర్మాన్ని, ఆ ధర్మాన్ని ఆచరణలో నుంచటానికి తనకుగల బాధ్యతలను అర్థంచేసుకోనాలి. అంతేనా? అలా అర్థంచేసుకోనటం అంటే ఈ రాక్షసి, ఈపిశాచి మనలో ముసలంగా పుట్టి మనలని అహోరాత్రాలు వేధిస్తూ వుండడంచూస్తూ ముభావంతో వుండకూడదు. ఈ దారుణ రాక్షసకృత్యాల్ని అదురూ బెదురూ లేకుండ ధైర్య సాహసాదులతో ప్రతిఘటించాలి... మన పూర్వులు ఎంతో వోపికతో, భక్తిశ్రద్ధలతో కట్టిన మన ఇంటి కప్పు కూలిపోతూవుంది. గోడలూ పెద్ద దెబ్బతిన్నాయి. అవీ ఒకేపళాన కూలిపోతూ వున్నాయి. వాటిని చూస్తూ వూరక వున్నామా ఇక పునాదులకే ముప్పువస్తుంది... నాయకుడు మనకి మచ్చుమందు పెట్టారు. దాన్ని అస్తమానమూ తింటూ, వాళ్ళ వుచ్చుల్లో పడిపోయాం... ఇదంతా మోసం. పెద్దమోసం. ఈ సందిగ్ధావస్థలో ఈ మోసాన్ని మనం క్షుణ్ణంగా అవగాహనం చేసుకోనాలి. మనగ్రామాలూ, పట్నవాసాలూ అగ్నిపాలయిపోయాయి. మనపెద్దలు

హతమయిపోయారు. ఎక్కడచూసినా అసహాయత. పిరికితనం పైచెయ్యి వేసుకుంది... ఈ అసహాయతను, ఈ పిరికితనాన్ని ఎంతకాలం సహించగలుగుతాం?.."

"మనపెద్దలు పోయారు. మిగిలినవారు అయోమయంలో, అంధకారంలో వుండిపోయి వుక్కిరిబిక్కిరి అయిపోతూవున్నారు... మనపెద్దలు అలా దౌర్భాగ్యావస్థలో వుండిపోయినా జాతిపేరు ప్రతిష్ఠలని నిలువబెట్టగలవారు యువకులు, విద్యార్థులు, విద్యార్థినులు. ఈ యువకులని తన వుచ్చుల్లో వేసుకోవాలని ఆ రాక్షసి అస్తమానమూ శతవిధాల ప్రయత్నం చేస్తూవుంది. వాళ్ళని ఆకర్షించటానికి ఎన్నెన్నో ఆశలను పెట్టాడు. పెద్దపెద్ద మాటలను చెబుతూ వాళ్ళని గుటకాయిస్వాహా చేసుకోనటానికి ఆ రాక్షసి అవలంబిస్తూవున్న తతాంగాన్ని వివరిస్తే మీరే నిశ్చేష్టులయిపోతారు... ఆరాక్షసి అటూఇటూ రాత్రింబగళ్ళూ పొంచి చూస్తూవున్నాడు. హుషారుగా వుండాలి. అతని తతంగాన్ని తెలుసుకోవాలి. దాన్ని నిరోధించాలి. యువకులు, వాళ్ళలోవున్న శక్తులన్నిటినీ ఈ రాక్షసిని బాహాటంగా నిరోధించటానికి వుపయోగించాలి."

"జాతి అంటే, దేశమంటే, ప్రభుత్వంఅంటే తనే అని ఈ రాక్షసి, ఈ బ్రహ్మరాక్షసి పొలికేకలని పెడుతూవున్నాడు. ప్రక్కవాద్యం వేస్తూ ఆరాక్షసి జట్టు చేస్తూవున్న రభస ఇక మాటలతో చెప్పితేనా యువకులగు మీరే మీతలల్ని వేలవేసుకోవాలసి వస్తుంది యీ అవమానాన్ని, అప్రతిష్ఠనీ భరించలేక!. దేశమంటే, జాతిఅంటే మీరే. యువకులగు మీరే, ఈ దేశాన్ని, ఈ జాతిని, ఈ ఆపత్కాలంలో నిలువబెట్టడానికి మీకున్నంత బాధ్యత మరెవ్వరికీ లేదని యువకులగు మీరు గ్రహించాలి... గాఢనిద్రావస్థలో నుంచి చప్పున లేవాలి. యువకులు, విద్యార్థులు, ఈ సమయాన ఈ రహస్యాన్ని అర్థం చేసుకొని మేల్కొన్నారా... తరువాతి కార్యక్రమమంతా యథాతథంగా, దేశకల్యాణానికి, జాత్యభ్యుదయానికి,... అంతేకాదు, లోకయోగక్షేమానికి సక్రమంగా జరిగిపోతుంది..."

సోఫీ కరపత్రాన్ని పూర్తిగా చదివివేసింది. ఆపిల్ల మనోభావాలు ఈ మార్గానే దొర్లుతూ వున్నాయిగా! హాన్స్ అన్నయ్య ఆలోచనలూ ఆదోవలోనే నడుస్తూ వున్నాయి. వాళ్ళ స్నేహితులు అలెగ్జాండర్, క్రిస్టల్‌ల ప్రపంచమూ ఈ దోవను చెందిందేగా! వాళ్ళు ఎక్కడ కలుసుకున్నా, వాళ్ళు ఎప్పుడు కలుసుకున్నా, వాళ్ళ సంభాషణ ఇదేగా, ఈ దుర్భరావస్థలో యువకులు ఎలా ముందంజవేస్తూ, ఈ క్లిష్ట సమస్యని నిర్భయంగా తేల్చాలనే కదూ!.. కరపత్రంలో పేర్కొనబడ్డ జర్మను సుప్రసిద్ధ రచయితల వాక్యాలు వాళ్ళకి కంఠస్థంగా వచ్చు. వాళ్ళసమావేశాల్లో వాటినిగురించి ఎన్నెన్నిసార్లు చర్చించారు! అంతా సరేగాని, ఈ కరపత్రాన్ని ఇంతకూ ఎవరు వ్రాసివుంటారు?......

ఆ కరపత్రంలోని మాటల సరళినిచూస్తే ...మన హాన్సూ, వాడి స్నేహితులూ వ్రాసి వుండాలి! వాళ్ళు సాహసవంతులని సోఫీకి తెలుసు... అయినా ఇలాటి కరపత్రాలని వ్రాసి వూళ్ళో పంచిపెట్టటానికి ప్రారంభించారా! ఎంత ప్రమాదం! ఎంత ప్రమాదం! వాళ్ళని కలుసుకుని ఈ సంగతినే అడగాలి...అని అనుకున్నది.

సోఫీ ఇలా తలపోస్తూ ఆ కాగితాన్ని బహు జాగ్రత్తతో తన సంచిలో దాచింది. యూనివర్సిటీలో ఆరోజు వుదయాన చేయాలసిన పనినంతా చప్పుచప్పున చక్కబెట్టుకున్నది...

ఇక విశ్వవిద్యాలయపు ఆవరణంలో ఎలాగు వుండగలుగుతుంది. హాన్స్ అన్నయ్యని వెంటనే కలుసుకోవాలి. ఆ సందేహాన్ని ఆ క్షణాన్నే నివారణ చేసుకోవాలి......

అక్కడినుంచి సోఫీ తిన్నగా హాన్సు బసచేస్తూ వున్న చోటికి మరో నిమిషంలో చేరుకున్నది.

## II

సోఫీ హాన్సు గదిలోకి తిన్నగా వచ్చింది. ఆ సమయాన హాన్సు ఇంట్లో లేడు. బహుశా హాస్పటలులో ఆనాటి పని పూర్తిచేసుకోలేక సతమతమై పోతూ వుండవచ్చు. అన్నయ్య వచ్చినంతవరకు అక్కడే వుండిపోవాలని సోఫీ నిశ్చయించుకున్నది.

గది అంతా అలికిడిగా వుంది. గదిలోని సామాన్లని చక్కబెట్టుకోంది హాన్సు సాధారణంగా బయటికి వెళ్ళేవాడు కాడే! కాని ఆ గదిలోని దృశ్యాన్ని చూశాక సోఫీ హడలిపోయింది. బల్లమీద పుస్తకాలు కుర్చీలమీద పుస్తకాలు. షెల్ఫులో వుంచక ఇలా వాటిని ఎందుకు వుంచివెళ్ళాడు మరి?... పుస్తకాలు తెరువబడివున్నాయి. ఏదో పనికోసం వాటిని ఇలా తెరిచివుంచాలి. అంతేనా! తెరిచిన పేజీలలో పెన్సిలుతో గుర్తులు పెట్టాడు. ఆ పుస్తకాలు ఈ కాలపు రచయితల పుస్తకాలు కావే! 18, 19 శతాబ్దాలలో పేరు ప్రఖ్యాతులు గాంచిన కవులు వ్రాసిన గ్రంథాలు అవి... వుబుసుపోక ఆ పుస్తకాలని చదువాలని సోఫీకి వుత్సాహం కలిగింది. ఆపిల్ల ప్రప్రథమంలో తనకు దగ్గరగావున్న కుర్చీమీదనుంచి తీసుకున్న పుస్తకము జర్మను కవి చక్రవర్తి షిలర్ వ్రాసిన చరిత్రగ్రంథం. తెరిచివుంచిన పేజీలో ఆ మహాకవి ప్రాచీక కాలపు రాజ్యాంగ పరిస్థితులనుగురించి వివరిస్తూవున్న భాగం మీదికిసోఫీ దృష్టిపోయింది. దానినే చదవటానికి సోఫీ ప్రారంభించింది:

"ఒక ప్రభుత్వాన్ని చక్కని మార్గాన నిర్వహించాలంటే, దానిని నడిపే వ్యక్తి తన స్వలాభాన్ని పూర్తిగా మరచిపోవాలి. దేశాభ్యుదయం, ప్రజల యోగక్షేమం, లోక కల్యాణం ముఖ్య విషయాలనే సంగతి ఆవ్యక్తి మరచిపోయాడా ప్రభుత్వయంత్రాన్ని చిందరవందర చేసిన వాడవుతాడు. ప్రభుత్వయంత్రాన్ని ఇతర్లని తన అదుపాజ్ఞల్లో వుంచుకొనడానికి ఎట్టి పద్ధతులనైనా ఆచరణలో పెట్టడానికైనా నదురూ బెదురూ అనేది ఏకోశానా ఆ వ్యక్తికి వుండదు. ఆ వ్యక్తినిరంకుశత్వాన్ని ప్రశ్నించటానికి ఇతర్లకు దమ్ములు లేక పోయాయా, ఆ వ్యక్తి ఆ దేశానికి, ఆ ప్రజకు తీసుకుని రాబోయే ప్రమాదం ఇంతింతని చెప్పాలా? దేశాభ్యుదయం స్తంభించి పోతుంది. జనాంగము యథేచ్ఛగా తమ పనిపాటల్ని చేసుకొనటానికి ఏ మాత్రమూ ప్రజాకోటికి స్వాతంత్ర్యం అనేది వుండదు. దేశం అధఃపతనమవుతుంది. దేశభాగ్యోదయానికి ఇంతవరకు చేయబడ్డ కృషిఅంతా వ్యర్థమైపోతుంది. అంతేనా? ఆ దేశపు పేరు ప్రతిష్ఠలకూ, సంస్కృతికి, నాగరికతకు చెప్పరానంత అపకీర్తి వస్తుంది............ అంచేత దేశభాగ్యోదయాన్ని మనోవాక్కాయాలతో వాంఛించే వాళ్లంతా, ఆ దేశపు ప్రభుత్వయంత్రాన్ని నడుపుతూ వున్న నాయకుల పద్ధతులని ప్రతిఘటించటానికి సర్వావస్థల్లో తయారుగా వుండాలి. అట్టి ప్రతిఘటనలో ఎలాటి కష్టం వచ్చినా దానిని దేశంకొరకు, ప్రజకొరకు, లోకశాంతికొరకు ఆనంద పూర్వకంగా ఎదుర్కొనటానికి సంసిద్ధులయివున్నారా...... వాళ్లే ధన్యులు. వాళ్లుచేసే త్యాగం మూలాన అష్టకష్టాలనుంచి ప్రజాకోటి తట్టుకో గలుగుతుంది. దేశం అప్పుడే ముందంజ వేయటానికి స్తోమత అనేది వుంటుంది.............."

ఆ కరపత్రంలో ఇలాటి వాక్యాల్నే కదూ తను చదివింది!.........ఈ పుస్తకంలో ఆ మాటలే స్పష్టంలో అగపడుతూవున్నాయి. పేజీకి ఇరు ప్రక్కల్నే హాన్సు పెన్సిలుతో గురుతులు పెట్టాడు. అంటే హాన్సే ఈ కరపత్రాన్ని తయారు చేశాడన్న మాట!......ఎంతో మంది యువకులు, వుత్సాహవంతులు, ఆదర్శమూర్తులు, దేశాభిమానులు, జాత్యభ్యుదయాన్ని అహోరాత్రాలు వాంఛించేవాళ్లు వున్నారుగా! వాళ్లు చేయాలసినపనిని హాన్సు చేయటమా?...... ఆలా చేయటం మూలాన హాన్సు వాళ్ల ఇంటిల్లి పాదికీఎంత వుపద్రవం తేబోతున్నాడో హాన్సుకి తెలుసా? మొట్ట మొదట వుపద్రవం వచ్చేది నాన్నకి. ఇప్పటికి నాన్న పడుతూ వున్న బాధలు చాలక......మరి కొత్త ప్రమాదాల్ని కూడా ఆయన ఎదుర్కొనాలసి వుందా? అమ్మ

ఈ మూలాన ఎంత బాధపడాలసివస్తుందో?...... అంతేనా, ఇంతవరకు నిర్భయంగా తన పంథాలో పని చేసుకుంటూవున్న హాన్స్‌ని పూర్తిచేయకుండ విస్తారా?.........

ఇలాంటి ఆలోచనలు సోఫీ బుర్రలో రేకెత్తిపోతూవున్నాయి. వాటిని మరో మార్గాన నడపటానికి ఆ పిల్ల శతవిధాలా ప్రయత్నించింది. ఎంత ప్రయత్నించినా ఆ ఆలోచనలు ఆ పిల్లకోరికను అర్థం చేసుకుంటేనా? అయోమయావస్థలో సోఫీమునిగిపోతూవుంది. గాఢాంధకారం. అంతా గాఢాంధకారం. హాన్స్ యోగక్షేమాన్ని తలపోస్తూవుంటే ఆ పిల్లకి వెలుగనేది అగపడితేగా! ఆ చీకట్లో నాన్నని చూస్తూంది. అమ్మని చూస్తుంది. వాళ్లకి రాబోయే అవస్థని తలపోస్తూ కంగారుపడుతూ వుంది. ఇంతేనా? హాన్స్ నేస్తాలు ఈ అల్లకల్లోలంలో ఎలా వుక్కిరి బిక్కిరి అయిపోవాలసి వస్తుందో?..........హాన్స్ ఎంత వుదారవంతుడైనా, ఎంత వుత్సాహవంతుడైనా, వాడుచేసే పనికి అంతూ పంతూ అనేది అవసరమని వాడు తెలుసుకోవాలి...... లేకపోయిందా నాశనమవుతుంది. అంతా నాశనమైపోతుంది...............

సోఫీ ఇలా కంగారు పడుతూవున్న సమయాన్నే హాన్స్ లోపలికి వచ్చాడు. అన్నయ్యని చూసిందో లేదో, "ఈ కరపత్రాన్ని ఎవరు తయారుచేశారో తెలుసా?" అని వుద్రేకంతో, ఆవేశంతో సోఫీ హాన్స్‌ని చప్పున ప్రశ్నించింది.

"అలాటి విషయం మనం తెలుసుకోనటం అనవసరం. అలా తెలుసుకోనటానికి ప్రయత్నించామా, ఇతర్లకి అనవసరంగా కష్టాల్ని తెచ్చినవాళ్లమవుతాం" అని హాన్స్ సూటిగా జవాబిచ్చాడు. "హాన్స్! నువ్వు అలా జవాబియ్యటం సబబుగా లేదు. మనకి ప్రశ్న అవసరం లేక పోయినా, గూఢచారులు అన్ని చోట్లా వున్నారుగా! వాళ్లకే ఈ సంగతి తెలిసిపోయిందా......ఏమవుతుందో నేను చెప్పటం అవసరంలేదుగా. వాళ్లు రాక్షసులు. ఎలాటి అవినీతిపనినైన చేయటానికి వెనుకంజ వేయరు...... అలాటి వాళ్లని నువ్వు ప్రతిఘటించ గలుగుతావా?" బెదరిపోతూ ఆ భయాందోళనలో సోఫీ అన్నది......................

ఆ కరపత్రం వచ్చిన మరి కొంతకాలానికి మరి మూడు కరపత్రాలు ఆ ధోరణిలోనే ప్రచారంలోకి వచ్చాయి. వాటికి "తెల్లగులాబి" అనేపేరు నీయబడ్డది. యూనివర్సిటి క్లాసు రూముల్లో ఎక్కడ చూసినా ఇవే. మ్యూనిచ్ నగరంలో ఏ వీధిలో చూసినా, ఏ సందు గొందుల్లో చూసినా ఈ కాగితాలే ప్రత్యక్షం. ఆ నగరంలోనే కాదు, దక్షిణ జర్మను ప్రాంతంలో పట్నవాసాల్లో, గ్రామాల్లో ఈకరపత్రాలకు ఈయబడ్డ ప్రచారం ఆగోజుల్లో మరి ఏ ప్రభుత్వ ప్రకటన పత్రాలకీ లేదని చెప్పటంలో ఏ మాత్రమూ అతిశయోక్తి లేదనే అనాలి......

జడివాన కురిసినట్లు ఆ కరపత్రాల వర్షం కురిసింది. తరువాత వర్షం ఆగింది. ఆ సంగతినే తరువాత తలపెట్టినవాళ్లు లేదు.

---

## స్వాతంత్ర్య దినోత్సవము.

కేసరిహైస్కూలులో స్వాతంత్ర్య దినోత్సవము ఆగష్టు 15 వ తేదినాడు వైభవోపేతంగా జరుపబడెను.

కేసరి విద్యాసంఘ అధ్యక్షులు డాక్టరు. టి. యం. బాలకృష్ణ నెడుంగాడిగారు జాతీయ పతాకమును ఎగురవేసిరి. విద్యార్థినులు జాతీయ గీతములను పాడిరి. ప్రధానోపాధ్యాయులు శ్రీ కే. వెంకటరాజుగారు స్వాతంత్ర దినమును గురించి, జాతీయ పతాకమును అభిమానించి గౌరవించవలసిన ఆవశ్యకతను వివరించి, విద్యాలయపు పురోభివృద్ధిని వివరించారు.

# కేసరి విద్యాలయముల శ్రీ వేంకటేశ్వరహాలు నూతన భవన ప్రవేశ మహోత్సవము

చెన్నపట్టణమునందలి త్యాగరాయ నగరులోని కేసరి విద్యాలయముల శ్రీ వేంకటేశ్వర హాలు నూతన భవన ప్రవేశ మహోత్సవము 31-8-56 నాడు సుప్రసిద్ధ సినిమానటుడు శ్రీ అక్కినేని నాగేశ్వర రావుగారి అధ్యక్షతన శ్రీయార్లగడ్డ రంగనాయకులుగారి కుమారుడు శ్రీ రామనాథం బాబుగారు చేసిరి.

ప్రార్థనానంతరము కేసరి విద్యాసంఘపు కార్యదర్శి దివాన్ బహదూరు బండి శ్రీ హరిరావు నాయుడుగారు ఉత్సవములో పాల్గొన్న వారికి స్వాగతము చెప్పుచూ, శ్రీ వేంకటేశ్వర హాలు నిర్మాణమునకు తిరుపతి దేవస్థానం కమిటీవారు రెండు దఫాలుగా రు. 10000 లు విరాళమిచ్చిరనియు, శ్రీ వెలపూడి రామకృష్ణ, కేసరి విద్యా సంఘ సభ్యులగు శ్రీ సి. సత్యనారాయణరెడ్డి, శ్రీ ఐ. శ్రీధరరావు ప్రభృతుల సహాయ సహకారాలతో 20000 రూపాయల పాఠశాల భవనమును నిర్మించ కలిగితిమని చెప్పిరి.

కేసరి విద్యాలయముల ఉనికియొక్క ప్రాధాన్యతను ముఖ్యంగా త్యాగరాయ నగరునందలి తెలుగు కుటుంబాలు గుర్తించి తమ బాల బాలికలకు విద్యావసతులకై కేసరి విద్యాలయములను వినియోగించుకోవాలనియు, చలన చిత్రరంగంలోని వారు చిన్న పెద్ద అనే విచక్షణారహితంగా శక్తికొలది విద్యాలయముల అభివృద్ధికి తోడ్పడవలసియున్నదని చెప్పిరి.

శ్రీ నాగేశ్వరరావుగారు సినిమా రంగంలోనున్న వారి తరఫున కేసరి విద్యాలయముల పురోభివృద్ధికి సహాయం చేయగలనని వాగ్దానంచేస్తూ మద్రాసులోని వారిని కేసరి విద్యాలయముల అభివృద్ధికి తోడ్పడవలసినదిగా విజ్ఞప్తిచేశారు.

శ్రీ యార్లగడ్డ రామనాథం బాబుగారు తాము విద్యాపోషకులుగా, అనేక విద్యాసంస్థల నిర్వాహకులుగా మద్రాసులో తెలుగు బాల బాలికల విద్యావసతులకుగాను రెండులక్షల రూపాయలిచ్చిన కీ॥ శే॥ కేసరిగారికి జోహారులర్పించి తాము సయితం తమ తండ్రిగారు ఏర్పరచిన 'విద్యాభివృద్ధి నిధి' మూడు లక్షల రూపాయలనుండి త్యాగరాయనగరులో ప్రస్తుతమున్న కేసరి విద్యాలయములతోపాటు హైస్కూలు స్థాపనకు ప్రయత్నించెదనని వాగ్దానం చేసిరి.

విద్యాలయముల బాలబాలికల నృత్యగానములు ప్రేక్షకుల నానంద పరవశులను చేసినవి. ముఖ్యంగా ప్రసిద్ధ సినిమానటి శ్రీమతి జి. వరలక్ష్మి కుమార్తె కుమారి కనకదుర్గ, అవలూరి శాంత, కుసుమలత నృత్య ప్రదర్శనములు ప్రశంసనీయములు.

---

మద్రాసు త్యాగరాయనగరునందలి కేసరి విద్యాలయముల
శ్రీ వేంకటేశ్వరహాలు నూతన భవన ప్రవేశమహోత్సవ సమయమున
కార్యదర్శి అయిన
దివాన్ బహదూర్

# శ్రీ బండి శ్రీహరిరావు నాయుడుగారి ఉపన్యాసము

—o—

ఆంధ్ర సోదర సోదరీమణులారా!

ఈరోజు మా కేసరి విద్యాసంఘమునకన్న వ్యక్తిగతముగా నాకుచాలా పర్వదినము. యేమనగా స్వయంకృషివల్ల జీవనోపానములో పైమెట్లకువచ్చిన వ్యక్తులంటే నాకు యెక్కువ గౌరవము. ఆ గౌరవభావమే నన్ను కీ॥ శే॥ శ్రీ డాక్టరు కేసరిగారికి ఆకర్షించినది. కీ॥ శే॥ శ్రీ కేసరిగారి "నా చిన్ననాటి ముచ్చట్లు"-అనే పుస్తకము చదివిన వారందరికీ, వారిని చెన్నపట్టణములో చిన్నతనములోనుండి యెరిగినవారికీ, వారు యెన్నికష్టములుపడి గొప్ప స్థితికివచ్చిరో తెలియగలదు. అట్టి మహానుభావుడు తన యార్జనలో రెండు లక్షల రూపాయలు చెన్నపట్టణములోని ఆంధ్ర బాలబాలికల విద్యాభివృద్ధికి యిచ్చినారంటే వారి యౌదార్యమును చాటకయే చాటుచున్నది.

వారు సంపాదించిన గొప్పస్థితికి నేను రాకపోయినను, చిన్నప్పుడు కష్టములు అనుభవించుటలో నేను వారి కేమాత్రము తీసిపోలేదు. డబ్బులేకపోయినను, నాజీవితములో నాకు చేతనైనసహాయము బీదలకు చేయవలెనను సంకల్పములోకూడా తీసిపోలేదని నా యభిప్రాయము. అందుచేతనే వారు మైలాపూరులో హైస్కూలు స్థాపించిన తర్వాత త్యాగరాయనగరములో ఆంధ్ర బాలబాలికలు విద్యకు చాలా కష్టపడుచున్నారని విని ఒక "యెలిమెంటరి స్కూలు" స్థాపించి అద్దెయింటిలో నడుపు సమయమున నేను 60 సం॥వయస్సు వచ్చువరకు సర్కారుపుద్యోగము చేసి ఢిల్లీలో భారతప్రభుత్వములో ఉద్యోగము విరమించుకొని త్యాగరాయ నగరమునకు వచ్చిన తర్వాత శ్రీ కేసరిగారికి చేయూతగా యుండుటకు సంకల్పించుకొంటిని. స్కూలు కొరకు వెంటనే సర్కారునుండి 2½ యకరముల స్థలము సంపాదించగలిగితిని. దానిమీద ఎలిమెంటరీ స్కూలు భవనము కట్టవలెనని దానికి కావలసిన ధనము సేకరించుటకు ప్రారంభించితిని. నాకృషిలో యెక్కువగా తోడ్పడినవారందరు స్వయంకృషివల్ల పైకి వచ్చినవారే. అందు మొదట చెప్పకోదగ్గవారు కీ॥ శే॥ ఎం. ఆర్. రాజగోపాల్ నాయుడుగారు. ఆయన ప్రోత్సాహము వల్ల రూ 10,000 లు లభించినవి. చిన్నస్థితినుండి పైకి వచ్చిన శ్రీ పి. గోవిందరాజుగారు అడిగినవెంటనే 5,000 రూపాయలు వాగ్దానముచేసి యిచ్చినారు. శ్రీ టి. ఎస్. సుందరంగారు, శ్రీ సి. వీరరాఘవశెట్టిగారు మొట్టమొదట 1000 రూ॥ యిచ్చినారు. ఇటులనే 35,000 రూపాయలు సంపాదించి మొదటి భవనమును సర్కారువారు ఇచ్చిన 2½ ఎకరముల భూమిలో క్రీ॥ శ॥ 1950 సం॥లో గౌ॥ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారిచేత శంఖుస్థాపనము చేయించి, క్రీ॥శ॥ 1950 సం॥ ఏప్రిల్ నెలలో గౌ॥ మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారిచేత ప్రారంభోత్సవము చేయించితిమి.

ఈ ఆరు సం॥లలో విద్యార్థులసంఖ్య క్రమేణా యధికమగుటచే త్యాగరాయనగర పరిసరప్రాంతములలో పిల్లల సౌకర్యముకొఱకు 1952 సం॥లో మిడిల్ స్కూలు స్థాపించితిమి. త్యాగరాయరోడ్డుకు దక్షిణముగా సర్కారునుండి 3 ఎకరములభూమి ఆటస్థలమునకు సంపాదించితిమి. మిడిల్ స్కూలు స్థాపించుటచేత, ప్రాథమిక పాఠశాలకు వేరే భవనము అవసరమైనది. అదియునుగాక ప్రాథమిక పాఠశాల ప్రత్యేకముగాయున్న, యెంతమంది ఉపాధ్యాయు లున్నను వారి జీతములు సర్కారువారు భరించెదరు. కనుక మేనేజ్ మెంటువారికి నష్టమేమియు యుండదు. నేను ఫింఛన్ పుచ్చుకొన్నతర్వాత 3 సం॥ములు శ్రీ తిరుపతి

(497-పేజి చూడుడు)

# కలసివచ్చిన కాలం

(గతసంచిక తరువాయి)

శ్రీ విద్వాన్ సాధన వీరాస్వామి నాయుడు, ఎం. ఏ., బి. ఓ. యల్.,

4-వ రంగము

(దృశ్యము-గదిలో మేజాపై పుస్తకాల వరుసలు. ఒక ప్రక్క గడియారము. కుర్చీలలో వరుడు గోపాలం, వాని తండ్రి ఉందురు.)

తండ్రి:-ఏరా! అబ్బాయీ సెప్టెంబరు పరీక్షకు ఫీజు మొన్ననే చచ్చిచెడి కట్టాను. నీవేమో సరిగా చదువుట లేదు. ఏమో దినానికి ఘానముద్ర ఎక్కువౌతుంది. ఏమీ ఒంట్లో బాగాలేదా?

గోపాలం:-లేదు నాన్నా! బాగానే చదువుచున్నాను. అట్లని ఇరవైనాలుగు గంటలు చదివితే బుఱ్ఱ పగిలి పోదూ?

తం:-(చిఱునవ్వు, చిరాకుతో) అందుకే వచ్చే సంబంధాలన్నీ అట్టే ఎగిరిపోతున్నాయి, అదో మొన్న సుబ్బయ్యగారు వచ్చారే వారు సంపన్నులుగాకపోయినా......(ఊపు) మంచి సాంప్రదాయము గలవారుగా నున్నారు. ఆ ఊరి ఆడబడుచు చంద్రమ్మను ఇక్కడ ఇచ్చియున్నారులే - ఆమె చెప్పింది, సుబ్బయ్యగారి పిల్ల చాల గుణవంతురాలట. గుణానికి తగిన కుదురుతనం, రూపం, చదువు వున్నవట! ఆమె మన యింట బంగారు ప్రతిమ మాదిరిగా ఉటుందట! ఆమె మాటలు విన్నప్పటినుండి అదేమో నాకూ మనసక్కే మళ్ళిపోతుందిరా! ఏమిరా నీ యభిప్రాయముఏమిటి?

గో:-నాకిప్పుడేమి పెండ్లి నాన్నా! తిన్నగా పరీక్షలైన వెనుక చేసుకుందాం.

తం:-సరే! నీవు తిండికి తిమ్మన్నవై యీ మాదిరి గజనీమాముదు దండయాత్రలు చేస్తుంటే నిన్నెవరురా మేపేది? పరీక్షఫీజుకు పడిన బాధ నాకు తెలుసు.

గో:-అయితే రేపు పెండ్లయితే ఒకరికి యిద్దర్ని మేపుతావా? నావల్ల పాపమా అమ్మాయికికూడా నరకమా!

తం:-అదేమిటి వెఱ్ఱి నాగమ్మా? అట్లాగంటావ్ - మీ యిద్దరి పోషణ — నీ చదువు భారమూ...(ఊత) సర్వమూ అంతా వారే భరిస్తారురా! (కొంచెము తగ్గు స్వరమున) నీవు నామాట వినుసరేఅను.

గో.-(కొంచెం చిరాకున) కోప్పడకండి నాన్నా! నామాటలకు - పెండ్లాన్ని భరించవలసినవాడు భర్త కదా, అట్లా భరించలేక అత్తారింటిపైకి తోసేసి,

పైగా తానుగూడా వారియింటివద్ద ఏ మర్యాదతో నుంటాడు? మానవత్వమున్న ఏ మొగవాడును యిలా చేయడు. నాకిది సుతరామూ ఇష్టంలేదు.

తం:-అరరే చూస్తూనే పిల్లవచ్చి గృద్ధును వెక్కిరిస్తుంది! నీవేమో దేవలోకము నుండి దిగివచ్చినట్లు మాట్లాడుతావు. (కోపముతో చేయి త్రిప్పుచు) నీతాహతుకు ఉప్పుగల్లు సంపాదించుకోలేవు. ఏదో నీకు చదువు సాకుతో కొంచెము జీవనోపాధి కల్పిస్తామంటే నాకే నీతులు నేర్పుతావా!

గో:-(గంభీరముగ) లేదు నాన్నా! క్షమించండి. ఊళ్ళో వాళ్లను ఏడ్పించడమేనా యీ చదువు ప్రయోజనం? స్వయం పోషక శక్తి దేవుడిచ్చాడు. ఇంక వేరే జీవనోపాధి యేమిటి?

తం:-ఒరే దద్దమ్మా! లోకంలో కట్నాలు పుచ్చుకొనేవాళ్లంతా స్వయం పోషక శక్తి లేనివాళ్లా? లేక బీదవాళ్లా? ఇప్పుడు కట్నాలు పుచ్చుకుంటేగాని పెండ్లి కొడుకులకు గౌరవము లేదు. ఏదో గాలి తోలేటప్పుడు తూర్పార పట్టకపోతే మరెప్పుడోయ్ నీవు సంపాదించి వెలగబెట్టేది? చెప్పినమాట విను. ఏదో బేరముచేసి కుదుర్చుకుందాం. ఇంటికి వచ్చే సిరిని కాలదన్నుకోవద్దు. మళ్లీ యీ మాదిరి ఛాన్సులు దొరకవు.

గో:-(వెక్కిరింపుగా) దొరకవులే! ఊళ్ళోవాళ్ళని దీవాలా దీయిస్తేగాని నీకడుపు నిండదు. ఇట్లా పోగుచేసి దాచిపెట్టు-దాచిపెట్టిన సొమ్ముగతి ఆ పిమ్మట తెలుస్తుంది.

తం:-(గట్టిగా) ఏమిటిరా పిడుగా! ఒక్కడే ఒక్కడని ఓర్చుకునేకొద్ది పట్టపగ్గాలు లేకుండా మీరిపోతున్నావ్. నా కష్టార్జితమంతా ఎవరికోరకు? నీ కొరకేగదా! ఇంత మాత్రము ఇంగితము లేదూ?

గో:-లేదు నాన్నా! ఉంటే మీమాట విననూ? మీకొక్క కూతురు పుట్టి ఉంటే నే చెప్పేదేమిటో మీకర్థమై యుండును.

తం:-కూతురుంటేం భయమా? నలుగురిలో నారాయణా! (ఊత) కావలసిన కట్నమిచ్చి కన్యాదానం చెయ్యలేమా? ఏమిరా నీ అర్థ సవాలు?

గో:-లేదు నాయనా! ప్రస్తుతం ఆడుబిడ్డల కన్నవారల అగచాట్లు వర్ణనాతీతం. అందులో ఇద్దరు, ముగ్గురు పిల్లలున్నవారి కడగండ్లు ఆ దేవదేవునికే ఎరుక! కొంపా గోడు అమ్ముకొని పిల్లల నొక యింటివారల జేసి తామేమో

యింటింటికి బిచ్చమెత్తుకొనేవారు కొందఱు! పెండ్లిచేసే తాహతు లేక ఇరవై, ముప్పై ఏండ్ల వయసు కన్యలను ఇంటిలో పెట్టుకొని కుమిలి కృశించే వారు కొందఱు! తల్లిదండ్రుల గోడు చూడలేక ఆత్మహత్యకు తెగించి నుయ్యో, గొయ్యో చూచుకొనే అమ్మాయిలు మరికొందరు! ఇట్లా ఎందరెందరున్నారో తెలుసా నాన్నా! నేటి సంఘంలో వరకట్నాల పిశాచం ప్రళయతాండవమెట్లా చేస్తుందో మీకు తెలుసా?

తం:-(చప్పరిస్తు) సంఘం—లోకమంటావేమిటిరా? లోకమెట్లా పోతే నీకెందుకురా? నాల్గు పైసాలున్నవానికే యీ కాలంలో పరువు మర్యాదలు. అందుకేగా నేనీ మార్గం నీకు చెపుతుండేది. నీవేమో నాకు తెలియదని నీ కాలేజీ ఉపన్యాసాలు దంచేస్తున్నావ్.

గో:-ఉపన్యాసాలేమున్నవి? చదువు కొన్నది ఆమాత్రము ఆచరణలో పెట్టకపోతే ఎందుకా చదువు? కాల్చనా? లోకులబాధ మీకు తెలుసు నంటావ్. తెలిసే ఎందుకు నాన్నా మళ్లీ నన్నీ కట్నాలడుగమంటున్నావ్?

తం:-అర్థము పురుషార్థమురా! అబ్బబ్బబ్బ......ఎన్నిమారులు చెప్పేది? చచ్చి పొయ్యేంతవరకు ఎట్లో ఒకట్ల సంపాదించాలరా.

గో:-ఒకటేమాట చెప్తున్నా నాన్నా! నీవేమో డబ్బు డబ్బని చస్తున్నావ్ నాకు నా సంపాద్యముతప్ప యింకెవ్వరిదీ దమ్మిడీ వద్దు. ఇదుగో! ఇప్పుడే మీ యిల్లు వదలి వెళ్లమంటేకూడా వెళ్లడానికి తయార్ (ముందుకు పోనుండును)

తం:-(గోపాలం చేతిని పట్టుకొని శాంతంగా) ఒరే పిచ్చి అబ్బాయీ! నాన్నారారా! బాబూ! కోపమా. ఏదో నీ మంచి కొరకు నేనిన్ని పాట్లు పడుతున్నాను. నీ సుఖము కోరి నాకు తెలిసింది చెప్పాను. దీనికింత కోపమైతే ఎట్లారా? పోనీ నీ యభిప్రాయము చెప్పరాదా?

గో:-ఎన్నిసార్లు చెప్పేది? అసలుమాట నీ మనసుకెక్కితేనా?

తం:-ఈ తడవ చెప్పు నాన్నా! తప్పక వింటా. మేము ముదసళ్లమై పోతున్నాం. నీకు త్వరలో ఒక ముడి వెట్టి నీ కడుపులో ఒక కాయకాస్తే చూచి పోదాం అని గంపెడాశతో నున్నాముగా.

గో:-అదా మీ ఆశ? ఐతే కానివ్వండి.

తం:-అట్లా చెప్పు నా బంగారు తండ్రీ! మొన్న సుబ్బయ్యగారు వచ్చారే

వారింటికి పిల్ల చూపులకు మీా యమ్మ, నీవు ఇద్దరు రేపు పొండి.

గో:-(సిగ్గున) అమ్మ చూస్తే చాలులే!

తం:-లేదురా నాన్నా! ఈ కాలపుపిల్లలు-మీాకు చెప్పాలనా? నాకు తెలియదటరా!-నీకూ ఇష్టమే (నవ్వు) కాని నా ముందర అట్లా బిడియ పడతావు. పరవాలేదు. నీవు తప్పక పోవాలి. నీకిష్టమైతే మా కంతా ఇష్టమే. కట్నం విషయము మీారెత్తకండి. నేను చూచుకొంటా ఆ వ్యవహారం - ఏం - తెలిసిందా?

గో:-ఆఁ తెలిసింది. కట్నం విషయమేమిటి? ఇంకా మీారు కట్నము విషయం మరచి పోలేదా?

తం:-(విసుగుతో) ఆఁ... ఆఁ... మరచిపోయినా ఇంక పోరా బాబూ!

గో:-అంత విసుగెందుకు నాన్నా? ఇప్పుడే పెండ్లి తొందరేం? నిదానంగా జేసుకుందాం.

తం:-లేదు అబ్బాయ్! నామాటవిను. ఏదో కాలం కలసివచ్చేటట్టుంది. కల్యాణము వచ్చినా కక్కు వచ్చినా - నిలవదురా-నీకు తెలియదు. శుభయోగం! పెండ్లియోగం! వచ్చిందిరా! తప్పకుండా మనం దీన్ని ఆహ్వానించవలసిందే.

గో:-అయితే మొన్ననే మాటయివ్వకూడదా? ఆ వచ్చిన పెద్దమనిషినంత గడబిడ చెయ్యకపోతే?

తం:-ఒరే సత్యకాలపు పెద్దమ్మా! నీ కేమి తెలియునురా పెండ్లివిషయాలు! ఇచ్చి పుచ్చుకొనే బంధువులు ఎన్నిమారులు తిరిగితే అంత అనుభవం వస్తుంది. పెండ్లికొడుకు, పెండ్లికూతురు ఒక రొకరిలోగుట్టు విషయాలు ఒక్క నాటికే తెలియవోయ్-ఊరకే నా అన్నారా! "ఏడు జోళ్లు అరిగితేనేకాని పెండ్లి కాదని" పెద్దవాళ్ళు!

గో:-(ఎగతాళిగ, నవ్వుతూ) అది ముందు బస్సులు — రైళ్ళులేని రోజుల్లో నాయనా! ఇప్పుడు స్వరాజ్యంవల్ల పల్లె పల్లెకు బస్సులే - నడిచేవాడేలేడు. ఇంక చెప్పలరిగేదేమిటి? చాదస్తం!

తం:-మాదంతా మీాకుఱ్ఱాళ్లకు చేదస్తమే. పెద్దవాళ్లమాట చద్దికూటి మూట! అది నీకు ముందు తెలుస్తుందిలే!

గో: సరే! ఎందుకీ శాపనార్థాలు? ఉదయమే పోతాములే.

తం:-(సంతోషమున) అబ్బా! నా బంగారు కొండగదూ!

## 5-వ రంగము

(దృశ్యము-సుబ్బయ్యగారింట్లో పెండ్లి కూతురు తల్లి వెంకమ్మ పెండ్లికొడుకు తల్లి రుక్మిణమ్మ.)

వెంకమ్మ:- రాక రాక మా యింటికి వచ్చారు రుక్మిణమ్మగారూ! ధన్యుల మైనాము. మాయిల్లు పావనమైంది. మీ మర్యాద — మన్నన మొన్ననుమావారు మీ ఊరినుండివచ్చి చెప్పారులే అమ్మా!

రుక్మిణమ్మ:-ఏముందమ్మా మమ్మట్లా పొగడడానికి? ఏదో మా యింట్లో కలిగింది పెట్టాము. కాని, మీ అమ్మాయి అంటేనే ఏమో మా వారికి పట్టరాని ఆనందం. సుబ్బన్నగారు వచ్చిననాటినుండి మమ్మ ప్రయాణము చేస్తూనేయున్నారు. ఈ మధ్య నాట్లు వేయడం, తీరికలేదమ్మా. మనకీ ముల్లుగఱ్ఱకు చాలని సేద్యముంది గదమ్మా! నేటికి సంతోషంగా పప్పు కూటికి వచ్చాం వదినా!

వెం:-అమ్మమ్మ. ఎంతమాట! తమ వంటివారు మాయింటికి పప్పుకూటికా! మా భాగ్యమే భాగ్యము! అయినా మా అమ్మాయి సంగతి ఎట్లా తెలిసింది మీ వారికి వదినా?

రు:-ఇదో యీ ఊరిపిల్ల చంద్రమ్మటగా- ఆమె మా ఊళ్లోనే కాపురముచేస్తుంది. ఆ పిల్ల చెప్పిందిలే - అప్పటినుండీ తండ్రీ కొడుకుల కిద్దరికి మీ యింటిపైన్నే బుద్ధి మళ్లింది.

వెం:-అదంతా మా అదృష్టం. ఘూడకనే పిల్ల నచ్చిపోవడం, వెంటనే పిల్లను చూడడానికి అబ్బాయేరావడం- ఇదంతా మా పిల్లచేసుకొన్న పుణ్యవిశేషం. మా రాధ ఏదో సిగ్గుపడుతున్నది మీకు సపర్యచేయడంలో. అది ఆకు మడుగు పిందె. మీ రేమీ అనుకోకండి.

రు:-అదేముందమ్మా! ఆడదానికి సిగ్గు సాజమేకదూ! పెండ్లికాని పిల్లమరీ!

వెం:-మొదటి పుట్టిన మొగ్గ మాకదే. అందుకే అల్లారు ముద్దుగా పెరిగింది. తర్వాత ఆలస్యంగా మొగపిల్లలు పుట్టారు వదినా!

రు:-వెంకాయమ్మ! నాకూ వీడొక్కడే కాస్త వయసైనవెనుక పుట్టాడు. ఏడుకొండల వెంకన్నవరాన లేకలేక పుట్టాడు. వీడే మా పంచప్రాణాలు. వీడికి తగిందే మీ పిల్ల. ఈడూ జోడూ బాగా కుదిరింది వదినా! అందుచేత మీ పిల్ల యింక మా పిల్లే. ఏం? మా వారి విషయము చెప్పనే పనిలేదు. మా పిల్లవాడుకూడా ముసిముసి నవ్వులతో ఉన్నాడు. ఇంకేం! మంచి రోజున ముహూర్తం పెట్టించండమ్మా!

వెంకా:-(ఆనందాన విప్పారిన మొగముతో)

బలేబాగుంది! ఏంతొందరమ్మా! మా రాధ నాన్న మొన్ననే ఏదో స్నేహితుల పనిమీద నెల్లూరు వెళ్ళారు. ఆయన వచ్చేవరకుండండమ్మా! నిదానంగా మాట్లాడుకోవచ్చు.

రు:-లేదమ్మా! ఇంటిదగ్గఱ ఆయనే చేతులు కాల్చుకోవలసి వస్తుంది. నేనేమో కొంచెం పెద్దదాన్ని అయిపోతున్నానుగదా! అందువల్లనే మా వాడు ఇంకా చదువుచూ ఉండినా పెండ్లిచేయడం. ఇది శాస్త్ర గమనించండి. మీరు ఆలుమగలు - ఇది యిట్లా ... (ఊత) అనుకొని మాకు తెలపండి. మేము చక్కా వస్తాం; ముహూర్తం పెట్టుకుందాం త్వరగా; ఈ శ్రావణంలోనే చేసేద్దాం పెండ్లి.

వెంకా.-సరేలేండి. ఆలాగే.

రు:-చెప్తానంటేకాదు. మాకు వెంటనే తెలవాలి. ఇదుగో మాటల్లో ఒకటి మరచా - అన్నీ సరేగాని ఒక్కదానిలో పెంకెవారు. ఇందులోనే అబ్బా కొడుకులకూ ప్రతిదినము వాద ప్రతివాదాలు. కాని కడకు కొడుకే గెలిచాడులే. మావాడంటాడు - "సంఘంలో కట్నాలివ్వలేక ఆడపిల్లలకి పెళ్ళిళ్లు కావడములేదు. వాళ్ల తల్లిదండ్రులు యమయాతనలు పడుతున్నారు. అందువల్ల నేను కట్నంలేకుండా పెండ్లిచేసుకుంటాను" అని. కాని పట్టుదల మనిషి మావారు - "కట్నం ఏలాగయినా పుచ్చుకోవాల" అని అంటారు. కాని తుదకు పిల్లవానికే లొంగిపోయారు. ఆయన పైకి పులితోలు గప్పుకున్నట్లుంటారు. మనసు పిల్లవానిపైన్నే. అందువల్ల మీరు ఆ యిద్దరికి సరిపొయ్యేటట్లు ఆ పెండ్లి మాత్రము చేయించియిస్తే మధ్య మార్గం బావుంటుందని నా తలంపు. తర్వాత మీ కూతురు - అల్లుడు ముచ్చట్లు మురిపాలు మీరే చూచుకుంటారుగా!

వెంకా:-ఇదా సంగతి? మా సంసారపు స్థితి మీకు తెలిసిందే. పెండ్లికేమి! మేమే చేస్తాం. కట్నాలు వద్దంటారా? ఎంత చల్లనిమాట! అబ్బా ఎంత ధన్యులం! ఆ ఏడుకొండల భగవానుడే మీ మనసు అట్లా మంచిగా మార్చేసినాడు.

### 6-వ రంగము

(దృశ్యం-గోపాలు - రాధ పెరటిలో బావివద్ద, రాధ పాడుచుండును.)

రాధ:-ఆనందమేగా - ఆనందమేగా
అమ్మ నాన్నకు ఆనందమేగా
కట్నములేకే కల్యాణమంట
కలసివచ్చె నా భాగ్యమేర ॥ఆ॥

కంఠపాశమీ కట్నమునుండి
కాలకూట పాషాణమునుండి
కడలి నడుమ సుడిగుండమునుండి
బ్రతికి బయటబడగల్గినాముగ ॥ఆ॥
కూవ్రూ - కూవ్రూ - కోకిల్లారా!
రాధపెండ్లి కిటు రారా మీరూ?
కట్నమెలేని కల్యాణమటా!
తప్పక అంతా దయచేయండీ! ॥ఆ॥

గో:-(వెనుకవైపునపోయి) ఓహో! ఎంత చక్కగా పాడుతుందీ కోకిల? వసంత కాలముపోయి చాల కాలమైనా ఇంకా ఎక్కడిదీ కోకిల? ... (రాధ సిగ్గున ముందు పరుగెత్తును) పరుగెత్తకు! పరుగెత్తకు! ఏదీ మళ్లీపాడు - నిన్నేమి వేటాడిచంపే బోయవాణ్ణికాదులే.

రా:-వేటాడుటకు రాకపోతే ఇక్కడ దొడ్డిలో తమరికేమిపని?

గో:-ఓహో అదా? అందాలరాణి - కోకిలవాణీ ఎక్కడుంటే అక్కడే నాకూ పని.

రా:-కట్నాలు చెల్లించలేనిది అందాల రాణేనా?

గో:-నీవుకూడా మా నాయనమాదిరి పొరబడుచున్నావు. అబ్బా! యీ కట్నాలు ఎందరి హృదయాలు చీల్చి చిచ్చుపెట్టుతున్నాయ్.

రా:-పొరబాటుకాదు. మా దిలేమి డికాపురము. మీ నాన్నగారేమో మిమ్ములను నాలుగేండ్లు ఇంజనీరింగు చదివించాలన్నారట! దానితో మా యమ్మ నాన్న క్రుంగిపోయారు. మా యింట్లో మేమున్నాము. మళ్ళీ ఇప్పుడు మీరు మమ్ము రచ్చకీడ్చడానికి వచ్చారా?

గో:-లేదు రాధా! నీవేమి బెంగపెట్టుకో వద్దు. సత్యంగా చెప్పుచున్నా, నీ గుణశీలాలువినే నిన్ను పరోక్షంలోనే ప్రేమించాను. ఇప్పుడు ప్రత్యక్షమయ్యాను. నా కలలు నిజమైనవి. ప్రేమలత నవలు కొనలు సాగింది. ఇంక పువ్వులు కాయలు కాయవలసిందే.

రా:-మనం పసివాళ్ళము. ఈ సంఘంలో పెద్దవారు చెప్పినదే సిద్ధాంతం.

గో:-అట్లా అనకు. గ్రుడ్డి సంఘం. అది కుంటినడక నడుస్తుంటే నేనొప్పుకోను. మా నాయన కఠిన హృదయమును కరిగించాను. ఆయనిప్పుడు నానిర్ణయానికి సుముఖుడే. వారి అనుమతితోనే నేనిక్కడకు వచ్చాను రాధా!

రా:-ఆఁ. నిజంగా! అయితే యిందాక లోపల మాఅమ్మ మీఅమ్మ మాట్లాడుకుంటూ. ... ...

గో:-ఆ ... దొంగా! నీవన్నీ పొంచి వింటూనే యుంటావా? ఏమి మాట్లాడుకొన్నారు. మన పెండ్లి విషయమేగదా?

రా:-ఔను. మీరు అబ్బా కొడుకులు కట్నం పుచ్చుకోవడం - మానడం - వీనిని గురించి చాల కుస్తీలు తీసేవారటగా?

గో:-ఔనౌను - తర్వాత ...

రా.-ఆ కుస్తీలో మీదే గెలుపట!

గో:-ఔను మరి. ఈ వరకట్నాల మహామారికి ఎన్ని కుటుంబాలు నాశమౌతున్నవో తెలియడంలేదా? అందుకే కట్నాలులేని కల్యాణానికి బయలుదేరాను.

రాధ: బలే వీరులులెండి!

గో:-వీరుడో, శూరుడో! రాధాగోపాల వివాహంతో చూపిస్తా.

రా.-పెద్దవాళ్ళ కిష్టంలేకుండా బలవంతపు పెండ్లి వద్దండి.

గో:-అరే ఏమిభయపడతావ్? పెద్దవాళ్ళను ఎప్పుడో నావైపు మళ్ళించా; మీ వాళ్ళకూ ఇష్టమే. ఇంక నీ యిష్టమే కావలసింది.

రా:-అయితే మిమ్ములను ఇంజనీరు చేసే దెవరండి? ఆ పని నావల్లగాదే?

గో:-అబ్బో! ఎత్తిపొడుపులా? సరే నీవేమిచేస్తావు? నీ వయసట్లా అని పిస్తుంది.

రా:-నిజము చెప్పితే కోపమా?

గో:-కోపమెందుకు? నేను తప్పక ఇంజనీరవుతాను. ఆ బాధ్యతనాది. దానికీ నీ పెండ్లికీ సంబంధంలేదు.

రా:-కాని మీ బాబయ్య. ...

గో:-మా నాన్నమాటవద్దు. ఆయన పిసినారి. డబ్బంటే పడిచస్తాడు. నీతీ నీమము - దయా దాక్షిణ్యాలు లేవాయనకు. అందుకే మీ వాళ్ళను నా చదువుకని అట్లా అడిగుంటాడు.

రా:-మరి వారు పెద్దవారు. వారిమాట వినకపోతే ఎట్లా?

గో:-మంచి మాటకు చిన్నా పెద్ద ఏమిటీ? ఎవరికైన ఆలకించవలసిందే, పాటించవలసినదే.

రా:-ఆయన కట్నమడుగుట మీ మంచికేగా? మీరా డబ్బుతో ఇంజనీరవుతారు. బాగా రెండు చేతులా సంపాదిస్తారుగా!

గో:-ఔను బాగా సంపాదిస్తా. నిజమే! నా చదువుకు కట్నాల డబ్బేనా కావలిసింది? ఆ యినప్పెట్లో మూల్గేధన మెవరికిస్తాడు? ఇందుకే మానాన్నకు నాకూ రోజూ పోట్లాటలు. ఇంకా

ఆ ఆటలు నా ముందటసాగవు. మా నాన్న మనస్సును బాగా మార్చేసానులే.

రా:-అమ్మయ్యా! మీ మాటలు నిజమేనా?

గో:-ఇంకా నన్ను నమ్మవా రాధా? ఈ ప్రకృతి పులకరింపజేసే యీ పుష్పాల తోడు.

రా:-క్షమించండి. మీ మనసు నొప్పించాను.

గో:-సరేలే! నీవేమి తప్పు చేసావని క్షమించుటకు - పరహృదయములోని భావాలనడిగి తెలుసుకొనుటలో తప్పేముంది? ఒక్కమాట కట్నాలుతీసికోని పెండ్లికొడుకు నీకిష్టమేనా?

రా:-(సిగ్గున) కోరుకుంటే జరిగేదా నాయిష్టమనడానికి? అది నా యదృష్టము.

గో:-నీ చక్కని అదృష్టము నీ ముఖంలోనే కన్పడుతుందిలే! (లోపలనుండి రాధా రాధా యని కేకలు).

(సశేషం)

# స్త్రీ ధర్మము

మూలము :

"భూమండలేశ్వర" స్వామి శివానంద సరస్వతీజీ మహరాజ్

అనువాదము :

"శివానందపాదసేవక్" స్వామి శ్రీనివాసానంద సరస్వతి



జగన్మాత కాళిదేవీ స్వరూపులగు ప్రపంచమందలి స్త్రీలకు నా మాన పూర్వకారాధనలు, సాష్టాంగ ప్రణతులు.

భగవానుని భ్రాంతి శక్తి (మాయ) యగు పరాశక్తి స్వరూపమే స్త్రీ. ఆద చైతన్య మాయాయే. ఆమె వ్యక్తస్వరూపములోనున్న దుర్గలేక కాళిదేవి; ఆమె యీ విశ్వోత్పత్తికారిణి లేదా సృష్టి కర్త్రిణి. ఆమె మానవుని విశ్వాసపాత్ర మగు సహచర జీవిత భాగధేయ.

స్త్రీ భగవానుని ఘనమగుచేత, ప్రకృతియొక్క విచిత్రము, ఆద్భుతములలో నద్భుతము, ప్రపంచము యొక్క సంక్షేపము, సారము, జగత్తునకు నమూనా, పిండాండము (microcosm), గృహమునకురాణి, వాస్తవిక పరిపాలన కర్త్రిణి, ప్రకృతి లేదా మాయ యొక్క ప్రతినిధి, గృహాలంకారమగు లక్ష్మి మానవుని మధుర మిత్రము, సహచరియునైయున్నది.

స్త్రీ మానవునికే విధమునను, నే విషయములోను నల్పముగాదు. వారు మహోన్నత వ్యక్తులు. వారు తమ వాస్తవిక స్వభావ రీత్యానెంతటి క్షమ, ఓరిమి, భక్తి, ప్రేమయుతులు! వారు మానవునికంటె నెక్కువ సుగుణములు కలిగియుందురు. వారెక్కువాత్మ నిగ్రహము గల్గియుందురు. వారుకూడ నాధ్యాత్మిక పంధాను, త్రొక్కుటకును, జీవిత గమ్యమును చేరుటకును నర్హులే.

పరిశుద్ధ స్వార్థ రహితప్రేమ, ఆత్మబలిదానము స్త్రీలకు లోబట్టిన గుణముగ వర్ణింప బడినది. తెలివిగల, నాగరిక, అనురాగబద్ధ, ధార్మిక చింతనగల స్త్రీ గృహమునకు లక్ష్మియే. ఎచ్చటనైతే భార్యాభర్తలు, మేళవింపుగ పవిత్రప్రేమ యనెడి త్రాటి తోడ లంకింప బడుదురో, నెచ్చటనైతే భార్యాభర్తలు దినము నాధ్యాత్మిక గ్రంథముల పారాయణ మొనర్చుచు, సక్రమ జపధ్యానముల గావించుచు శ్రీహరి నామమును సంకీర్తించుచుందురో నా గృహమొక వైకుంఠమే. తన భర్తనెడ ననురాగ బద్ధమగు స్త్రీ పృథ్విపై నొక అరుదగు పుష్పము, గృహమున కొక నాశీర్వాదము, కుటుంబమునకొకవి రాజమానమగుమణి. సుగుణవంతురాలగు భార్య ఆమె భర్తకొక చూడామణియే.

## పాతివ్రత్యము

"చూడాల" రాణి - జ్ఞాని. ఆమె చాల నద్భుత శక్తుల గల్గియుండెను. తన భర్తయగు శిఖిధ్వజుని పరోక్షమున విస్తార రాజ్యము నేలెను. "సులభ" యొక బ్రహ్మవాదిని ఆత్మ విచారము బ్రహ్మచింతన యందామె మునిగి యుండెడిది. ఆమె పేరుపనిషత్తుల లోను, బ్రహ్మ సూత్రములలోను వచ్చును. స్త్రీలకు తమ పతివ్రతా ధర్మము (సచ్ఛీలశక్తి) చే దేనినైన చేయ జాలుదురు. సావిత్రి తన గతించిన భర్తయగు సత్యవానునికి ప్రాణమును తిరుగ రప్పించెను. ఆమె వాస్తవికముగ మృత్యుదేవునితో పోరాడెను. అత్రి ఋషి భార్యయు, శ్రీ దత్తాత్రేయుని తల్లియునగు ననసూయాదేవి పాతివ్రత్యము మీరందరెరిగినదే. తన పాతివ్రత్య శక్తిచే త్రిమూర్తులను తన బిడ్డలుగ మార్చి

చేసెను. నలయని తన కుష్ఠ భర్త ప్రాణమును గాపాడుటకు సూర్యునాపివేసెను.

పురుషునికి బ్రహ్మచర్య మెట్టిదో స్త్రీకి పాతివ్రత్యమట్టిది. పాతివ్రత్యముకంటే నేదియు పురుషునిచే స్త్రీ నెక్కువ గొనియాడబడ చేయజాలదు. ప్లేటో (గ్రీకు తత్త్వవేత్త) "పిల్లలకు బంగారముకంటె పాతివ్రత్యముయొక్క ఆధిక్యతను వదల కుండుటుచిత" మనును. పాతివ్రత్యముగల స్త్రీ తన సచ్ఛీలము (పాతివ్రత్యము) కాపాడబడుచు నమిత దుఃఖము లోనున్నప్పటికిని జీవితమును పట్టుకొని యుండును. గొప్ప విపత్తులలో పడిపోయినప్పటికిని నామె తన పాతివ్రత్య శక్తిచే రక్షింప బడును. ఆమె తన పవిత్రతయొక్క బలముచే జీవించును. తన స్వకీయ యత్నములద్వారా తన్నుతాను కాపాడుకొని నిస్సంశయముగ స్వర్గమును, స్వర్గయాశీర్వాదములను నొందును. దమయంతి కేవల మొక సరళపదము (మాట)చే నొక బోయవానిని తన్ను బాధింప యత్నించినప్పుడు బూడిద దగ్ధ పరిచెను. రాజగు నలుడు తన రాజ్యమును గోల్పోయి తన శరీరమున నొంటి బట్టతో నరణ్యమున ప్రవేశించినప్పుడామె సంతోషముతో నిక్కట్టుల పంచుకొనెను. అందఱు స్త్రీలును సీత, దమయంతి, నలయని, అనసూయ నింకను నితర పూర్వకాలిక స్త్రీల జీవితములనుండి విచిత్ర పాఠముల తప్పని సంగ నేర్చుకొనవలెను.

## లజ్జ (Modesty)

లజ్జ స్త్రీలకాభరణము. లజ్జయొక్క సరిహద్దు దాటి జనుట, పురుషునివలె వర్తించుటయు, సుందర జాతి స్త్రీయొక్క కోమలత్వమును, శోభను, నాజూకును; అందమును విధ్వంస మొనర్చును. ఏదైతేలేనిదే సౌందర్యము నాజూకు విహీనమో నట్టి స్త్రీయందలి లజ్జ కొఱతనేదియు సరిపుచ్చ జాలదు. లజ్జ నమ్రత, అణకువ సౌహార్ద్రము (decency), కోమలత్వము, సాధుత్వము, మధురత్వముల విచిత్ర మిశ్రమమే. లజ్జ స్త్రీకి నతి మిక్కిలి యమూల్యమగు నగ. లజ్జగల స్త్రీ యానిత్య భావనచేనదుపులోనుండును. ఆమె ఉత్తమ ప్రవర్తన, రీతుల గల్గియుండును. లజ్జ నిజముగు ఘనత కొకచిహ్నము. లజ్జలేని స్త్రీ సౌరభములేని పుష్పమే. లజ్జలేని స్త్రీ చాల సుగుణముల పొందియున్నప్పటికిని కేవల సూన్యమే. లజ్జ స్త్రీని దివ్యత్వాహోదాకు లేవనెత్తును. లజ్జగల స్త్రీ యందఱనుండి గౌరవముల నధికారముగ గొనును. నాజూకు, మార్దవము, సౌందర్యము, అందము, కోమలత, లజ్జ, సేవ స్త్రీతోబుట్టినవి.

## విద్య

సరి మార్గముల స్త్రీలు విద్యగఱుపబడవలెను. సమాజమునకు సంస్కృతిగల (cultured) మహిళ లొక ఆశీర్వాదము. ప్రస్తుతము ధనికుడు లేదా పెద్ద కార్యాలయాధికారి తనకూతునకు హిందీ ఆంగ్లము, సంగీతము కుట్టుపనుల శిక్షణ నొసగుటకై ముగ్గుఱ లేదా నంతకంటె నధికముగ శిక్షకుల (tutors) నియమించును. ఆతడు తన కూతురిప్పడే విద్యతో సర్వలక్షణ లక్షిత, నేర్పరియగు (accomplished) పిల్లయైనదని తలంచును. ఆమె టెన్నిసు (tennis) నాడగలదు; బ్రిడ్జి (bridge) నాడుటలో బహు సమర్థురాలు. ఆమె గృహమందలి యతిథుల భోజన సత్కార మొనర్పగలదు. ఇది వాస్తవిక సంస్కృతి గాదు. ఇంటిలో నామె యెట్టి గృహకృత్యము చేయజాలదు. ఆమె సదా వంటవానిని దాసీ దానిని కోరును. ఆమె యెక్కువగ గృహపు చిత్రిత బొమ్మయే. ఆమె భర్తపైనొకబరువే. ఆమె భోగపూరిత జీవనము గడుపును. ఆమె యెప్పుడును జబ్బుగా నుండునేలన, గృహములోని నేకతిన కార్యము చేయుచుండుట లేదు. ఆమె సుఖము, సోమరితనపు జీవితముల గడుపుచుండును. శాసన సభ (Assembly) లలోను, సలహా సంఘ సమావేశము (Council)లలోను చోటు (seat) గల్గియుండుట స్త్రీకి వాస్తవిక స్వాతంత్ర్య మియ్యజాలదు. మహిళలు ధార్మిక (religious) రంగములో పిల్లల శిక్షణ నొనర్చుటలో నతి ముఖ్య భాగమును వహింపవలెను.

నేను స్త్రీల గర్హించను. వారికి విద్యా, స్వేచ్ఛల నొసంగుటపట్ల నే వ్యతిరేకించను. స్త్రీలపట్ల నత్యున్నత

మగు నాదరము నాకు గలదు. దేవీలవలె నేను వారి నారాధింతును. ఎట్టిది వారి వినాశమొనర్చునో స్త్రీల కట్టి స్వేచ్ఛపట్ల నే ననుకూలుండ గాను. విద్యయు సంస్కృతియు వారిని నాదర్శ స్త్రీలుగ, నమృతులుగ (మరణ రహితులు)గ, శోభాయమానముగ నొనర్పవలెను. నేను కోరున దేదన నిదియే. ప్రతియొక్కరును కోరున దేదన నదియే.

సడలింపు జీవనము (loose life) పరిపూర్ణ స్వేచ్ఛ గాదు. హిందూదేశపు కొందఱు స్త్రీ లిట్టి కపట స్వేచ్ఛ ననువుగొనుటచే తమ్ము తాము పాడుచేసుకొనిరి. పవిత్రత (purity) లేకపోవునో ధన సంపత్తిలో దొర్లినప్పటికిని, సమాజము నందలి యున్నత పరివారముల (high circles) లో మసలినప్పటికిని స్త్రీ జీవితమున నేమిగలదు? విచక్షణా హీనమైన కలసి మెలగుట (promiscuous miscing) విధ్వంసకారక ఫలితములను గొంపోవును.

సులభ, గార్గి, మదాలసవంటి మహిళా ఋషుల (తపస్వినుల), సావిత్రి, అనసూయ, నలయని వంటి పతివ్రతల, మీరావంటి మహిళా భక్తుల, రాణి చూడాలవంటి యోగినుల నుత్పత్తి చేసినది పుణ్యభూమియను హిందూదేశము మాత్రమే. రాజగు జనకుని ముందట "సులభ" యెట్టి గుర్పాటొనర్చు పన్యాస మొసగెను? జనకుడు సహితము వాక్స్తబ్ధుడాయెను. ఇట్టి మహా ఆత్మలు వారియొక్క పవిత్రత, భక్తి, జ్ఞానముల మూలమున మన హృదయములలో నేటికింకను వసింతురు. వారెంత సరళత, దైవికత్వము, వినమ్రతగలవారు! అధునాతన కాలపు మహిళలు వారినుండి యాదేశము (inspiration) గొనవలెను. వారు (పూర్వోక్త మహిళలు) గడపిన జీవితమును వారు (నేటి కాలపు మహిళలు) గడుపవలెను. నల్లని దట్టమగు మబ్బులతో పాదుగబడిన మెఱుగుడు నీలిమానభము (ఆకాశము)న తారగ నగుటలో ప్రయోజనములేదు. ఇది యజ్ఞాన మానవుల యొక్క బహుదానమగు వాంఛ. విషపూరిత, భౌతిక ప్రభావముక్రింద వారు గాజనదు. వారికి వాస్తవిక స్వాతంత్ర్యముగూర్చి భావనలేదు. స్వేచ్ఛగ నిటు నటు తిరుగుట, ప్రతిదానిని నొనర్చుట, దేనినైన తినుట, త్రాగుట, నితరుల ననుకరించుట, మోటారుకారు నడుపుట, న్యాయస్థానము (court) లకు జనుట, న్యాయాధికారి (barrister) పని నొనర్చుట స్వాతంత్ర్యముగాదు.

హిందూ స్త్రీయొక్క స్వేచ్ఛా దర్శ మెప్పుడును ధార్మికాధ్యాత్మిక ప్రాముఖ్యత (religious and spiritual significance) కలిగియున్నది. వేదాంత తత్త్వము (Philosophy) యొక్క తీవ్ర విద్యార్థినులగు "గార్గి", "సులభ" వంటి బ్రహ్మవాదినుల భరతదేశ ముత్పత్తి చేసెను. చదివిన విద్వాంసులు సహితము వారివద్ద కుత్తేజము (inspiration) నకై వచ్చెడివారు. "హాంగ్ ట్స్యాంగ్ (Hang Tsiang)" అను చైనా యాత్రికుడు తన స్మారక వ్రాతలలో (memories) భారత దేశీయ స్త్రీలయొక్క నున్నత హోదాను తెలియచేసియుండెను.

దేనిపై సమస్తము నాధారపడునో నట్టి ప్రాధాన్య ప్రశ్నయేమన స్త్రీ విద్య. ఒక జాతి లేదా నింక దేశముయొక్క పురోభివృద్ధి (progress) యైశ్వర్యము (prosperity) సంపూర్తిగా స్త్రీల విద్యపై నాధారపడియుండును. స్త్రీల విద్యమాత్రమే దేశమును తన స్వాభావిక స్థితికి లేవనెత్తగలదు. స్త్రీకి మీరు విద్య గఱపుచో కుటుంబమును, యావత్తు దేశమును స్వేచ్ఛగ మీరు విద్య గరపినట్లే. ఆపె కెట్టి రకపు విద్య యొసగబడవలెను? ప్రభుత్వ కార్యాలయములకు గుమాస్తాల నుత్పత్తిచేయుట కొఱకై "మెకాలే" ప్రభువు (Lord Macaulay) ప్రవేశ పెట్టిన నదే సరిసమాన విద్యగ నది నుండరాదు.

(సశేషము)



# శ్రీరామకర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గతసంచిక తరువాయి)

౪౧

నవరత్నఖచితమౌ నవ్యపీఠమునందుఁ
  గల్పవృక్షముక్రిందఁ గ్రాలినావు
విల్లంబులనుబూని - ప్రియముతో లక్ష్మణ
  వర్యుండు, నినుఁగొల్వఁ బరగినావు
ముత్యాల ఛత్రంబు-ముద్దుగా భరతుండు
  ప్రియము మీఱఁగఁబట్ట వెలసినావు
వింజామరలఁబూని-వేడ్క శత్రుఘ్నుండు
  సేవింప ముదమునఁ జెలఁగినావు
వామభాగంబునఁ సీత వఱలుచుండఁ
జిఱునగవు మోమునందునఁ జిందులాడ
రామ! వెలుగొందుచున్నావు; ప్రార్థనంబు
సలిపి, భజియించుచున్నాడ! శరణు!
శరణు!

౪౨

ఎడమచేత ధనువు - గుడిచేత బాణంబు
వెనుకనంబుల పొదిఁ బ్రీతిఁ దాల్చి
లక్ష్మణుండు గుడిని, లక్ష్మిధరాజాత
వామభాగమందు వఱలుచుండ.

౪౨ (a)

రామ! నీలమేఘశ్యామ! ప్రణతులొసఁగి
నిన్ను సేవించు భక్తుల, నిఖిల దుఃఖ
పుంజములఁ బాపుచుందువు పుణ్యపురుష!
నన్ను రక్షింపుమయ్య - శ్రీ నాథ! శరణు!

౪౩

అంబుజాక్ష! శ్యామలదేహ! కంబుకంఠ!
వీరపురుష! జటాజూట! వినుత లక్ష్మ
ణుఁడు, ధరాజాత, నీ సేవలుడుగ కెపుడు
సేయుచున్నారు రామ! నా సేవ లెంత?
యుడుత భక్తిని గ్రహియింపుమో -
ముకుంద!

౪౪

అప్రమేయుఁడీవు! యాజాను బాహుండ
వీవు! దాశరథివి! వినుత సుగుణ!
త్రిజగములను, వీర దేవుండవీవు! కో
దండధారి! నాదు దండ మిదిగో!

౪౪ (a)

లక్ష్మణుండు జెంత రాజిల్లుచుండంగ
దిక్కులేనివారి మ్రొక్కుబడుల
శ్రీ శుభాంగ! కరుణ జెలఁగఁ దీర్చుచునున్న
వాఁడవయ్య రామ! వందనములు!

౪౫

కోటి మన్మథరూప! కువలయ దళనేత్ర!
  రఘువంశ తిలకమా! రామచంద్ర!
కస్తూరి వాసనల్ గ్రమ్మిన దేహంబు
  గల్గి, నిర్మలుఁడవై గ్రాలువాఁడ!
ఖరరాక్షసుని ధైర్యగరిమను జెండాడి
  వీరాధి వీరుఁడై - వెలయువాఁడ!

ముక్కంటిసేవల - ముదముతోఁ గొను
వాఁడ !
అప్రమేయుండయి - యలరువాఁడ
చాంచల్యలకుఁ గామములఁ బుట్టించువాఁడ !
సీతతోఁగూడి శుభములఁ జెలఁగువాఁడ !
విష్ణు రూపుఁడౌ శ్రీరామ ! వేడ్క నిన్ను
భజన సల్పెద - కావుమా - భక్తవరద !

రఘు

దిక్పాలకు లఖిల దేవతల్ నీ పాద
కమలముల్ సేవింప గ్రాలినావు
సర్వలక్షణముల - సంశోభితంబైన
యమల దేహంబుతో నలరినావు
కనకకుండలముల కాంతిఁ బ్రకాశించి
పీతాంబరముతోడ - వెలసినావు
నీలమేఘశ్యామ ! నిగమవందితరామ !
సీతా మనోహరా ! శ్రీనివాస !
రఘుపతీ ! నిన్ను సతతంబుఁ బ్రార్థనముల
సేవసలిపెడివారికిఁ జింతలున్నె ?
రామ ! శ్రీరామ ! సీతాపతీ ! మనోహ
రా ! ముకుంద ! రక్షింపుమా-రామభద్ర !

(సశేషము)

# "ముగ్గురు నాటక కర్తలు — — గురుజాడ అప్పారావుగారు"

శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి

(1) ఆంధ్ర నాటక కర్తలలో గురుజాడ అప్పారావు పంతులుగారు ఒక విశిష్టస్థానం అందుకొన్నారనవచ్చును. సందేహములేదు. ఇందు కానాడు సాంఘికంగాను భాషా విషయంగాను పరిస్థితులు అనుకూలంగా వున్నాయి.

(2) ఆకాలములో బయలుదేరిన ఆంధ్ర నాటక కర్తలలో ఆంధ్ర నాటక పితామహ ధర్మవరం కృష్ణమాచార్యులుగారు మొదటివారు. వీరి నాటకాలల్లో ఇతివృత్తం పౌరాణికం; భాష గ్రాంధికం. ఈయన తరువాత క్రమ వికాసం సూచిస్తూ 'కళాప్రపూర్ణ' వేదము వెంకట్రాయ శాస్త్రిగారు చారిత్రాత్మకమైన ఇతివృత్తాలు గైకొన్నారు. వీరి తెలుగు, సంస్కృత నాటకములలోవలె ఉత్తమ పాత్రలకు గ్రాంధిక భాష; నీచ పాత్రలకనుగుణమైన వ్యవహారిక భాష. మహాకవి గురుజాడ అప్పారావుగారో, సాంఘిక యితివృత్తాలు, వ్యవహారిక భాష అవలంభించారు. వీరి కన్యాశుల్క నాటకమున "హాస్యరసనైర్మల్యము" కలదని అన్నారు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

(3) గురుజాడ అప్పారాయకవి మధ్య తరగతి కుటుంబములో జన్మించి తన చుట్టువున్న సామాన్య కుటుంబాలల్లో కనబడే జనాన్ని పరిశీలించి చిత్రించినాడు. రంగస్థలం విషయంలో విప్లవం సాధించి కృతార్థుడైనాడు. సంఘంలో కన్యాశుల్కం సమస్య తీవ్రంగా వుండేది. చిన్న పిల్లల్ని ముసలి వరులకు అమ్మిన వుదాహరణలు శతాధికంగా నుండేవి. విజయనగర మహారాజులుంగారు, వానిని లెక్కింప జేసినారు. సంస్కృతిగల వారందరికి కన్యాశుల్క దురాచారం మాన్పించాలని పట్టుదలగా వుండేది. అల్లాగే భాషలలో గ్రాంధిక భాష కృతకమై నాటకోచితంగాకుండా వెఱ్ఱి తలలు వేస్తూండేది.

(4) గురుజాడ అప్పారాయకవి, వీరేశలింగం పంతులు లాగే ఇటు సంఘం, అటు భాషా ఒక్కసారే సంస్కరించ బూనుకొన్నాడు. అటువంటి కాలంలో నాటకకర్త ప్రతిభావంతుడు, అంతకు మిక్కిలి వుత్సన్నడూ అయితేగాని కన్యాశుల్కం లాంటి స్వతంత్ర నాటకాలు బయలుదేరడం దుస్సాధ్యం. అప్పారావుగారు పాత్రౌచిత్యం, శీల చిత్రణం స్వతంత్రమైన కథావస్తువు, కల్పనా చమత్కృతీకల నాటకాన్ని వ్రాయాలని కొన్ని సంవత్సరాలు, చెక్కి చెక్కి, నిర్మించారు. అదే కన్యాశుల్కం. కన్యాశుల్కం ఆనాటి నాటక కళకి ఒక నిర్దిష్టరూపం యివ్వడానికి బయలుదేరింది. ఆనాడు ఆంధ్ర నాటకరంగములో ఏవో వీధి నాటకాలుతప్ప సరియైన రంగానుకూలమైన నాటకాలులేవు. ఆనాటి తెలుగు నాటకాలు ప్రాయికంగా సంస్కృత నాటకాలకి అనువాదాలు. శాకుంతలంలాంటి నాటకాలకు తెలుగులు లేదా స్వతంత్ర నాటకాలు – అందులోను సాంఘికమైన ఇతివృత్తాలే, – వృద్ధ వివాహంలాంటివి. ధర్మవరం కృష్ణమాచార్లుగారి 'చిత్రనళీయం' లాంటివి; – శబ్దాలంకారాలు, వృత్త్యనుప్రాసనలూ, చిత్ర – బంధ కవిత్వాలూ, నాటకాల్లో వుండడంవల్ల పండితులకు మాత్రమే చదివినప్పుడే అర్థమయ్యేవి. రంగానుకూల్యము తక్కువ. పాండిత్య ప్రకర్ష యెక్కువ. ఏ రాగంలో పద్యం చదవాలో ఆ పద్య పాదాలలో ఆ రాగం ఏదో తెలిపే సూచనలతో "నాధనామక్రియా నవ్య వైఖరి భామ"—భూపాలపుత్త్రి మొదలైన పదాల్తో ప్రారంభిస్తూ వుండేవి. గుజరాతీ నాటకం కంపెనీలు తెలుగు దేశంలో విహరిస్తూ తెలుగువారి అభిరుచుల్ని

తప్పుదారి పట్టిస్తూవుండేవి. ఈ నాటకాల్లో చాల వఱకు 'గులేబకావళి' వంటి హిందీ నాటకాలకి అనువాదాలు, పార్శీవుట్లు పాడి రంగం అంతా కలియ ద్రొక్కుతూ తళ తళ మెరిసే బుట్టేదారి పనితనంగల దుస్తులూ, కామోద్రేకాన్ని రేకెత్తించే నాట్యాలూ, చెవులు మోరెత్తించే పాటలూ, కత్తి కత్తులతో దొంగ పోరాటాలూ చూపిస్తుంటే, వెఱ్ఱెక్కిన జనం నాటకాలు చూడ్డానికి నాటక శాలల్లో క్రిక్కిరిసిపోయేవారు. అవి చూస్తే కల్గిన రోతవల్ల తెలుగు నాటక రంగానికి అటువంటి దుస్థితి తప్పించడానికి ఏదో ఒక నాటకం వ్రాయాలన్న కుతూహలమే కన్యాశుల్కంగా అవతరించింది.

(5) ఆనాడు పల్లెటూళ్ళలోను, బ్రాహ్మణాగ్రహారాల్లోనూ, కనబడే నియోగి వైదికి కుటుంబాల్లో కనపడే ఛాందసులూ, లౌక్యులూ, స్వల్పమైన ఆంగ్ల భాషాభ్యాసంతోపాటు పక్కాదొరలం అనుకున్నట్లు గానటిస్తూ, ఇంగ్లీషులోనే కవిత్వం చెవూ, స్కూళ్ళలో చదువుకొనే కుఱ్ఱాళ్ళను మోసగిస్తూండే గిరీశంలాంటి వాళ్ళను చిత్రించారు. ఆనాటి సంఘంలో వెంకటేశం లాంటి విద్యార్థులూ, రామప్పంతులు లాంటి కోర్టు పక్షులు నేటికీ కనబడతారు. ఇతరత్రా చాలా లౌక్యులైనా పిల్లల చదువు విషయంలో అడిగినంత డబ్బాయిస్తూ, వాళ్ళు డిప్టీకలక్టరో, పోలీసు ఇన్‌స్పెక్టరో అవుతారని ఆశపడేవాళ్లు చాలామంది వుండేవారు.

(6) అందుచేతనే కన్యాశుల్కం అనే దురాచారం సంఘంలో అంతగా కనబడకపోయినా, నాటకశిల్పరీత్యా ఈ నాటకానికి యెక్కువ విలువ వున్నది. అందుకే యిది నేటికీ పొగడొందుతూంది. ఇటీవల కన్యాశుల్కం ఫిల్ముగాకూడ తీయబడ్డది.

(7) ఆ కాలంలో ప్రబోధ చంద్రోదయంలోవలె పాత్రల పేర్లు పెట్టినప్పుడే ఆ పేర్లలో కొంతశీలం సూచింపబడేది. దుష్టబుద్ధివంటి పేర్లు పెడితే శీల చిత్రణం విషయంలో నాటకకర్తపూచీ తగ్గిపోతుంది. అటువంటి పేర్లు పెట్టకుండా చాలవరకు తప్పుకోవాలి. కాని బుచ్చావధాన్లు, కరటకశాస్త్రి, సౌజన్యారావు లాంటి పేర్లు అప్పారావుగారు పెట్టినారు. అయినా పాత్ర చిత్రణం మాత్రం మామూలుగానే సాగింది.

(8) ఛత్రాధిపతి మొదలు గ్రేవుడిగ్గర్సు అనగా - శవాన్ని పాతిపెట్టుటకు సమాధిగోతులు త్రవ్వేవారు:- వరకుగల అన్ని పాత్రల్నీ సృష్టించాడని షేక్స్పియర్ మహాకవిని గురించి అంటారు. అప్పారాయకవి వ్రాసిన యేకైక నాటికలో ఆంధ్ర దేశంలో అన్ని తరగతులవారూ కనబడతారు.

(9) కోర్టులు, ప్లీడర్లు, స్కూళ్లు, పండితులు, వారి విద్యార్థులు, దావాలంటే కుతూహలపడే శ్రోత్రియ బ్రాహ్మణులు, బాలవితంతువులు, అందులో అమాయికులు, శీలం చెడ్డవాళ్లు, పోలీసులు, పోలిసెట్టివంటి కోమట్లు, దొంగ సన్యాసులు, వెఱ్ఱి భక్తులు, పేకాటలు, అందులోవున్న పిచ్చి నమ్మకాలు, ఇదీ అదీ అని చెప్పడం ఎందుకు? కన్యాశుల్కం ఆనాటి సంఘానికి ఒక సమగ్రమైన Snapshot - (ఆకస్మిక ఛాయా చిత్రము):- అని చెప్పొచ్చు.

(10) అప్పారాయకవి కాలము 1861 మొదలు 1915 సం॥ల వరకు ఆనాటి సంఘంలో సంస్కృత విద్యాభ్యాసంమీద మోజు తగ్గుతోంది. కరటకశాస్త్రి శిష్యుడు హిమాలయ వర్ణన శ్లోకం కంఠతా రానందున వినుక్కుంటూ హిమాలయ పర్వతం రూళ్లకఱ్ఱలా లేదని గిరీశం చెప్పిన మాటలు విశ్వసిస్తాడు. చెప్పే గురువుకు విశ్వాసం లేదు. "హిమాలయం సిగ్గోసిరి గాని నీకో మంచి ఉపాయం చెప్తా, వింటావా అబ్బీ!" అంటాడు. అందుకే అమ్ము రార-భూభ్యములు అమ్మేసి నాసరే, ఇంగ్లీషు చదువు చెప్పించాలని అగ్నిహోత్రావధాన్లువంటి శ్రోత్రియులు అభిలాషపడతారు. కొంచెము ఇంగ్లీషు ముక్కలొచ్చిన గిరీశానికి ఛాందసము లేదు కాని, గాయత్రీసాక్షిగా అనీ, పాటిగ్రాఫ్ పంతులు నాకరిని నమ్మించడానికి ఒట్టెట్టుకొని యిన్నాళ్లకు జంధ్యాపోవన పనికొచ్చిందంటాడు. దెయ్యాలిని భూస్థాపితం చెయ్యడం సీసాలలో పెట్టిబిగించడం, భూజారి

గవరయ్య భూతవైద్యం చెయ్యడం యీలాటివి ఆ నాటి సంఘంలో జరుగుతున్న సంగతులు.

(11) గంజాయి త్రాగే సన్యాసి మూర్ఖ భక్తులను నమ్మించడానికి వేదాంతగోష్ఠి చేస్తాడు. అమాయికంగా, శిష్యులు సందేహాలు తీర్చుకొంటారు.

(12) ఆకాశంబు శూన్యంబు — అనే వాక్యం ఉండగా ఆకాశంబు బొక్కడ్డట్లుగా వానకుర్సింది, అనేవాక్యం ఏలా నిలుస్తుంది అని సందేహం. పార్టీ దగ్గిఱ ఫీజు పుచ్చుకున్నందుకు నాలుగు ముక్కలు కోర్టులో చెప్తాను గాని ముంగిలాగ కూర్చోనని ప్లీడరు, తన అభినివేశము ప్రకటిస్తూంటాడు. ఈ సన్నివేశాలన్నీ నేర్పుగా కన్యాశుల్క సమస్యకు అతుకువేసి కన్యాశుల్క నాటకాన్ని సమగ్ర కళాఖండంగా గావించాడు మహాకవి.

(13) ఆనాడే వందేమాతరం ఉద్యమం వల్లనైతే నేమి, బ్రహ్మ సమాజంవల్లనైతేనేమి, మన తెలుగు వాళ్ళకి, బెంగాలీ వ్యామోహం వ్యాపించింది. దాన్ని వెక్కిరించేలాగ—

(14) "వేంకటేశం! నిన్ను సురేంద్రనాథ బెనర్జి అంత వాణ్ణి చేస్తాను" అనీ—ఇదే బెంగాలీ కుఱ్ఱవాడైతే ఏంజేస్తాడో తెలుసా? తండ్రియ్యేది— తాతయ్యేది చెమ్డాలెక్కదీస్తాడు" అని గిరీశం అంటాడు.

(15) అయినా చాలక మనవాళ్లు వట్టి వెధవాయలోయ్ అనేస్తాడు—ఇందులో ఆంధ్రులకి ఆంధ్రేతరమైన ప్రతీదానియందూగల దురభిమానం వ్యక్తమౌతుంది.

(16) కన్యాశుల్కంలో గిరీశం పాత్ర కీలకంగా వుంటుంది. మొదటి అంకం మొదటిరంగంలో గిరీశంతో ఆరంభమైన నాటకం,"డేమిట్ కథ అడ్డంగా తిరిగింది" అని ఆఖరి అంకం ఆఖరి రంగంలో గిరీశమే పూర్తి చేస్తాడు. నాటకం అంతా సూదిలో దారంలాగ, గిరీశమే ప్రాముఖ్యం వహిస్తాడు.

(17) గురుజాడ అప్పారాయకవికి ఆ నాటి సంస్కరణ సంధిగ్ధావస్థలో వుందని తెలుసు. అదే కన్యాశుల్కంలో అక్కడక్కడ గోచరిస్తూంటుంది. ఆంగ్ల విద్యా సంస్కారం కలవారే వితంతు వివాహాల్లాంటి సంస్కరణలు చేయగలవారని గిరీశం పాత్రలో సూచించినాడు. కాని అందులోనే దగా కోరులుంటారు సుమా అనే హెచ్చరిక కూడ యిచ్చేడు. ఈ సంధిగ్ధావస్థలోనే "To be or not to be" అనే — స్వగతములోను "త్రోవ ఇటా—అటా" అనే మీమాంసలోకూడ ప్రదర్శించారు.

(18) కన్యాశుల్కం ప్రాచీన నాటక లక్షణాలకి కట్టుబడివుందా, లేదా అనే విచక్షణ అనవసరం. అట్లాగే కన్యాశుల్కంలోని భాష చిన్నయసూరి సూత్రాలకి విధేయమై వుందా? అనే చర్చకూడా అసందర్భం. ఈ రెండింటిలోనూ, విప్లవం సాధించడమే, అప్పారాయకవి ఉద్దేశం. ఆయన ఉద్దేశ్యం నెఱవేఱింది కూడాను. ఇటీవలి రచయితలు అప్పారాయ గురువు చూపించిన జాడల ననుసరించారు.

(19) నాటకానికి డ్రమేటిక్ ఐరనీ జీవగఱ్ఱ. పాత్రలు పరస్పరం ఎఱుగని కొన్ని విషయాలు ప్రేక్షకులకు తెలిసేటట్లు సన్నివేశం కల్పించబడితే యీ డ్రమేటిక్ ఐరనీ వస్తుంది. ఇటువంటి సన్నివేశాలు కన్యాశుల్కంలో లెక్కకు మించివున్నాయి. మధురవాణి యింటిలో మంచం క్రింద రామప్పంతులున్నట్లు గిరీశానికి తెలియదు. చివరి రంగంలో మధురవాణి మగవేషంలో వచ్చిందని సౌజన్యారావుకి తెలియదు. కరకటశాస్త్రి శిష్యుడు ఆడువేషంవేసి పెళ్ళి కూతురుగా అభినయిస్తున్నాడని మనకు తెలుసు—పాత్రలకు తెలియదు.

(20) సార్వకాలికమైన సామాన్య సత్యాలని స్పృశించడంవల్ల కళకి శాశ్వతత్వం వస్తుంది. అప్పారాయకవి అటువంటి సత్యాలెన్నో ఇందులో చెప్పేడు. ఒకచోట: 'తనుచేస్తే లౌక్యం, ఎదుటివాడు చేస్తే మోసం' అంటాడు.

'ఇంగ్లీషువాళ్ల బళ్లల్లో తెలుగుకి ఖాతరీ వుండదు' అని
'భజంత్రీవాళ్లు ఊరుదగ్గిటికి వచ్చేక గోలలావు
చేసారు' అంటాడు

'పగలు యాంటీనాచ్, రాత్రి ప్రోనాచ్చీనా'
అంటాడు.

(21) 'కొండుభట్టీయం' అని ఇంకో నాటకం ఆరంభించి పూర్తి చేయలేదు — ఈ మహాకవి. ఇందులో కన్యాశుల్కంలోని కొన్ని పాత్రలే మళ్లీ అవతరించారు. ఆంధ్రుల దురదృష్టంవల్ల ఆ నాటకం పూర్తికాలేదు. 'బిల్హణీయం' అనే పేరులో అసంపూర్ణంగా యింకో నాటకం వుంది. ఇందులో పండితులు రాజాస్థానంలో ఏలాగు తమ అసమర్థతను కప్పిపోషిస్తారో, రాజాస్థానంల్లో ఏలాగు ప్రవర్తిస్తారో మొదలైన విషయాలు హాస్యరస ప్రధానంగా చర్చించుతారు. పూర్తికాలేదు; కాని పూర్తి అయితే ఎంత బాగుండునోకదా అనిపిస్తుంది, ఐన కొంచెమూ చదువుతే.

(22) అప్పారాయకవి వంటి నాటక కర్తలు అరుదుగా పుట్టూవుంటారు. ఇటువంటివారు వాఙ్మయ వాహినికి భగీరథులవంటివారు.

(ఆలిండియా రేడియో — విజయవాడ కేంద్రము వారి సౌజన్యముతో).

—(౦)—



శ్రీమతి వవ్వేటి విమలాదేవిగారు
నెల్లూరుజిల్లా - వవ్వేరుగ్రామ సర్వ మహిళా
సభ్య పంచాయతికి అధ్యక్షురాలు

# గాలిపడగలు

శ్రీ కోశా బాలకృష్ణరావు

(గతసంచిక తరువాయి)



రోడ్డుమీద బస్సుదిగి, ఒక మైలునడిచి ఊళ్ళోకి వెళ్ళాలి. అప్పటికి సాయంత్రం ఏడుగంటలైంది.

ఆ సమయంలో, ఆ యింట్లో తన రాకకి ఎవరు ఎదురు చూస్తారు!

ఊరుదగ్గరౌతున్నకొద్దీ కాంతారావుకి ఏవేవో గుర్తుకు రావటం మొదలు పెట్టాయి.

2

రైలుబండి, సమాన్తాంతర రేఖలు సరిగా వున్నంతకాలం బాగానే నడుస్తుంది.

సరిగ్గా యిదే జరిగింది రాజయ్యా విషయంలో.

రాజయ్యాను గురించి బంధుకోటిలో తలకొక అభిప్రాయం వున్నమాట నిజమే. దాని నిజానిజాలు యిప్పుడు విచారించటం వల్ల చనిపోయిన రాజయ్యా ఆత్మకి శిక్ష కాని, భిక్షకాని ప్రసాదించగలదా ఈ సంఘం!

కాంతారావుకి తెలిసిందల్లా రాజయ్యా బంధుప్రియుడు అన్నమాటే. ఆయనతో పరిచయమల్లా తనకు, తన చిన్నతనం లోనే. తను పెద్దవాడై లోకాన్ని అర్థం చేసుకునేస్థితికి వచ్చేటప్పటికి రాజయ్యా పాత్ర ఈ విశ్వరంగంమీదనుంచి నిష్క్రమించింది.

మరీదారుణమైన విషయమేమిటంటే, చిరకాలం సుఖశాంతులతో గడిపిన రాజయ్యా కుటుంబం చూస్తూవుండగానే చితికిపోయింది అన్ని విధాలా.

బి. ఏ. చదివిన పాతికేళ్ళకొడుకు పోయాడు, పక్షవాతంలో తీసుకు తీసుకు.

కొడుకు చనిపోవటంతో పట్టిన శనితో ఉన్న పొలం కాస్త అమ్మేయాల్సొచ్చింది రాజయ్యాకి.

చేతికెదిగిన కొడుకు తన్ను నిస్సహాయుణ్నిగా చేసిపోయాడని విలపించాడు రాజయ్యా. వాడి చేతులలో తరించవలసిన తన కట్టె, నేడు వాడి సర్వస్వానికే నిప్పుపెడుతోంది. ఇంత వయసువచ్చిన తన్ను బ్రతికించి, పసివాణ్ని తన కొడుకును తీసుకుపోకపోతే ... రాజయ్యాకు దుఃఖం పొర్లుకొచ్చింది. వాడు తన కొడుకు; వాడు తనకి కొరివిపెట్టాలి. కాని - తనే వాడికి కొరివిపెడుతున్నాడు! కాదు-వాడే తండ్రి, తనే కొడుకు, తనే వాడికి కొరివిపెడుతున్నాడు.

ఒక విధంగా ఇదికూడా నిజమే.

రాజయ్య తండ్రే రాజయ్యకి కొడుకుకూడా అయ్యాడు. ఒకే రాజయ్య ఇద్దరు తండ్రులకి తలకొరివి పెట్టాడు.

స్మశానంలో కాలుతున్న కొడుకు స్థితిని చూచి, రాజయ్య అనుకున్న మాటలివి.

అప్పట్నుంచి రాజయ్య ఈ ప్రపంచం ముఖం చూడలేకపొయ్యాడు కొంతకాలం.

చచ్చినవాళ్లతో చస్తారా!

చచ్చినవాళ్లు మళ్లీ వస్తారా!

అదీలేదు - ఇదీలేదు.

రాజయ్యగుండె రాయిచేసుకున్నాడు' చేసుకోవటంకాదు. దానంతట అదే అయింది.

మళ్ళీ రాజయ్య మామూలుగా జీవించటం మొదలు పెట్టాడు. ఇప్పుడు రాజయ్య కుటుంబం పూర్వంలా ఉచ్ఛస్థితిలోలేదు.

అది ఇంకిపోతున్న చెరువు. ప్రపంచంలో కష్టసుఖాలు ఎవరికీ చెప్పిరావు. దుర్బలుడైన మానవుడు కాలం చేతులో కీలుబొమ్మ.

ఈ చిన్న సత్యాన్ని తరచి చూడటానికి రాజయ్య కుటుంబచరిత్ర ఒక తార్కాణం.

♦ ♦ ♦

రాజయ్య రెండో కొడుకు విశ్వనాథానికి పెళ్ళి అయింది. మూడో కొడుకు నారాయణ చదువుకుంటున్నాడు ఆ వూళ్ళోనే మిడిల్ స్కూల్లో.

అప్పటికి విశ్వనాథం సెంకడరీ గ్రేడ్ ట్రైనింగ్ప్యాసై ఒక ఎయిడెడ్ స్కూల్లో అసిస్టెంటుగా పనిచేస్తున్నాడు.

రాజయ్య తన పెద్దకొడుకు వీడేననుకో గలిగాడు మనసులో. మళ్ళీ మోడు వారిన జీవితాలు మోసులువేశాయి అనుకున్నాడు.

రాజయ్య పెద్దకోడలు పంకజం భర్త చనిపోయిన తర్వాత పుట్టింటికి చేరింది. అసలామె కాపురంచేసి ఏడ్చింది ఎక్కడ!

జీవితంలో వసంతమంటే ఏమిటో ఎరగని పంకజం తల్లిదండ్రుల పంచని పడి బ్రతకటమే పరమావధి అనుకుంది తన బ్రతుక్కి.

చెట్టుకి కాయలు బరువుకాదు.

పంకజం చెట్టున కాసిన ఒక కాయ— అది చెట్టునే పండి రాలి పోవాలి. అంతే రాసివుంది పంకజం నుదుటిమీద.

ఒకటి రెండుసార్లు రాజయ్య పంకజాన్ని తన ఇంటికి తెచ్చుకోవటానికి ప్రయత్నించాడు. కాని అది అప్పటికీ, ఎప్పటికీ సాగలా.

ఈ విషయంలో రాజయ్యకీ, పంకజం తల్లి దండ్రులకి మనస్పర్థలుకూడా రాక పోలేదు.

ఎవరి కడుపుమంట వాళ్ళు వెళ్ళగక్కారు.

చివరికి రాజయ్య అన్నాడు; 'చచ్చి నా కొడుకు సాధించాడు—బ్రతికి నా కోడలు సాధిస్తుంద'ని.

ఇవి రాజయ్య ఆత్మ పరీక్ష చేసుకొని అన్నమాటలుకావు. కాని అది అతనికి అప్పుడు తెలియలేదు.

రాజయ్యకి బాగా ముసలితనం వచ్చింది. సంసారంలో బాధ్యతలు పెరుగుతుండటం వల్ల అప్పులబాధ ఎక్కువైంది. ఇంత వరకూ రాజయ్య ఎట్లా సంపాదించి సంసారం వెళ్లదీశాడో ఎవరికీ తెలీదు. అసలతను అంత తేలిగ్గా తొణికేమనిషికాడు.

♦ ♦ ♦

హటాత్తుగా రాజయ్య మరణాన్ని గురించి ఊళ్ళో తలకొక విధంగా అనుకోవటం మొదలుపెట్టారు.

'మంచి కొంపలు ముంచాడు. ఆయన కేం! వెలిగినంతకాలం బాగానే వెలిగాడు.'

'కాని...పాపం చావు తుదకు మహా యాతన అనుభవించాడు. చెట్టంత కొడుకు పోయాడు. అంత కంటె దురదృష్ట మింకేముంటుంది ?'

'అయినాచేసుకున్న వారికి చేసుకున్నంత! ధర్మాత్ముడు - ఊరికంతటికీ, పెద్ద పులిలా వుండేవాడు, అంతటి మహారాజుకి ఎంతటి దశా'

'అయినా ఎంత యిది కాకపోతే అంత ఘోరమైన చావు చస్తాడు!'

జనవాదం పరంపరలుగా బయలుదేరింది రాజయ్య చావును గురించి దీనికంతటికీ, అందరికీ తెలిసిన కారణం ఒక్కటే.

రాజయ్య ఆత్మహత్య చేసుకున్నాడన్నారు అతని శరీరం కాలవలో దొరకటంచేత.

రాజయ్య ఊరినిండా అప్పులు మిగిల్చిపోవటంచేత, తీర్చేవిధం లేక, ఊళ్లో ముఖమెత్తుకు తిరగలేక, ఆత్మహత్య చేసుకున్నాడన్నారు బాకీదార్లు.

విశ్వనాథం సంపాదన ఇల్లుగడవటానికే అంతతమాత్రంగా వుంది.

ఉన్న ఆస్థిలోసగం మొదట్లో పెద్ద కొడుకు చదువులకీ, తరువాత వాడి పక్షవాతానికి ఖర్చుపెట్టాడు. కాని ఫలితం దక్కలేదు.

వేరే సంపాదనలేని రాజయ్య సంసారాన్ని పోషించటానికి మిగిలిన కొద్ది ఆస్థి తప్ప వేరే మార్గమేముంది ?

పుట్టినప్పట్నుంచి మహారాజ పోకిళ్లతో పెరిగిన రాజయ్య పెద్దకొడుకు చనిపోయేదాకా డబ్బును మంచినీళ్ల క్రిందే ఖర్చు చేశాడు. కొడుకు చనిపోయేటప్పటికి, తన కున్న ఆస్థిని చూపి వాడి చదువుకోసం,

జబ్బుకోసం చేసిన అప్పులు పర్వతాల్లా పేరుకుపోయాయి.

చెరువు ఎండితేగాని, చేపలు బయట పడవు. రాజయ్యచావుతో ఆ కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు బయటపడ్డాయి.

ఏది ఎట్లావున్నా రాజయ్య పేరవున్న కొరదలా ఆస్థి అంతా అమ్మగారూపాయికి పావలాలు మాత్రం దక్కాయి పెట్టుబడి పెట్టిన ఆసాములకి.

♦ ♦ ♦

రాజయ్య చనిపోయి ఏడాదయింది.

విశ్వనాథం ప్రయోజకుడయ్యాడు. అత నిప్పుడు ఆ స్కూలుకి హెడ్మాస్టరై హోదాకి తగ్గ సంపాదనే ఆర్జిస్తున్నాడు.

నారాయణ స్కూలు ఫైనలు చదువుకి వచ్చాడు.

వాణ్ని పట్నం పంపి కాలేజీలో చదివించాలని విశ్వనాథం ఆశయం. అది నెరవేర టానికి అతనెంతో కృషి చేస్తున్నాడు.

ఉదయం పదిన్నరదాకా స్కూలు, మధ్యాహ్నం పిల్లలకి ప్రైవేటు చెప్పటం, మళ్ళీ మధ్యాహ్నం బడి. సాయంత్రం ఐదు గంటలనించి ఇంటి ముందున్న బడి తోటలో పనితో సాయంత్రం ఎనిమిది గంటలదాకా వంచిన నడుం ఎత్తడు. మళ్ళీ రాత్రి పది పన్నెండు గంటలదాకా ఏదో చదువు.

ఇంత చేస్తున్నా తను ప్రయత్నంలో ఏదో పెద్దలోపం చేస్తున్నానని అసంతృప్తిగా బాధ పడతాడు విశ్వం.

భార్య రాజేశ్వరి చాలా చిన్నది. పాతికేళ్ళైనా నిండని విశ్వనాథం ఇంత పెద్ద భారాన్ని మోయటం ఆమెకు అంత ఇష్టంగావుండేదికాదు. అక్కడకీ విశ్వనాథం చాలావరకు రాజేశ్వరి మనసు తెలుసుకొని మసలుతుండేవాడు.

ఒకరోజు రాత్రి పన్నెండు గంటలకి పక్కచేరిన విశ్వనాథాన్ని అడిగింది రాజేశ్వరి.

'మీరు రాత్రింబగల్లు ఇంత కష్టం ఎందుకు పడాలి?'

దాని అర్థం విశ్వనాథానికి తెలియలేదు.

'అంటే'

'మీఆరోగ్యంకూడా లెక్కచేయకుండా, కాస్తన్నా విశ్రాంతితీసుకోకుండా ఎప్పుడూ ఏడా తెరిపిలేకుండా ఏదో పనిచేస్తూనే వుంటారే.. అసలే మీదొళ్లు మంచిదికాదు. తరువాత ఏమనుకున్నా ఏంలాభం!' అంది భయపడుతూనే.

'ఓసీ పిచ్చిదానా! మనమీద అమ్మా, తమ్ముడూ ఎన్ని ఆశలు పెట్టుకున్నారో నీకేం తెలుసు! కన్నందుకు అమ్మనీ, తోడుగా పుట్టినందుకు తమ్ముణ్ణీ మన మాదరించకపోతే యింకెవరాదరిస్తారు?' అన్నాడు ఆమె కళ్లలోకి చూస్తూ చిరునవ్వుతో విశ్వనాథం. (సశేషము)

ప్రగతి కొరకు ప్రణాళిక

# ప్రజాస్వామ్య
## సంఘ స్థాపనకై
## ప్రయత్నం











మన దేశములో, జనుల జీవనప్రమాణము వృద్ధిచేసి భాగ్యవంతమును వైవిధ్యమును కలుగు జీవిత సదవకాశములను వారికి కలిగించుటయే ప్లానింగ్ ముఖ్యోద్దేశము.

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951–56) పరిణామము :

- అధిక ఆహారము
- అధిక వస్తూత్పత్తి
- ఉత్తమ రకము సాంఘిక సేవలు
- ఎక్కువ ఉద్యోగములు
- అత్యధిక జీవన ప్రమాణములు

రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61) లక్ష్యము :

- జాతీయ ఆదాయాభివృద్ధి
- అతిత్వరగా పారిశ్రామికాభివృద్ధి
- ఉద్యోగావకాశముల విస్తరణ
- ఆదాయము-సంపత్తులలోగల వైషమ్యములను తగ్గించుట
- ఆర్థిక శక్తిని నిమముగానుంచుట

"ప్రణాళిక పరచుట ఒక ఎడ తెగని ప్రవృత్తి. దేశమును ఆర్థిక స్వాతంత్ర్యముతో బలవంతముగా చేయుటకు మరి కొన్ని పంచవర్ష ప్రణాళికలు అవసరము"

జవహర్‌లాల్ నెహ్రూ



## మా రెండవ పంచవర్ష ప్రణాళిక

## జాతీయ సౌభాగ్యము కొరకు

DA 56/52 T6

# సభలు — సమావేశములు

## దుగ్గిరాల మహిళా సమాజపు వార్షికోత్సవము

6-9-56 న దుగ్గిరాల మహిళా సమాజపు ద్వితీయ వార్షికోత్సవము శ్రీమతి కడప రామసుబ్బమ్మగారి అధ్యక్షతను జరిగెను. పరిసర గ్రామములనుండికూడ అనేక మంది స్త్రీలు వచ్చిరి. మహిళా సమాజము అధ్యక్షురాలు శ్రీమతి జంపాల రత్నమాణిక్యమ్మ గారు అతిధులకు, సభ్యులకు, ప్రేక్షకులకు స్వాగతము చెప్పిరి. కార్యదర్శిని శ్రీమతి జంపాల ప్రభావతీదేవిగారు క్రిందటి సంవత్సరపు రిపోర్టు చదివిరి. ఈ సమాజ పక్షమున నడుపబడు చున్న ప్రసూతి చికిత్సాలయార్థము పది వేల రూపాయలకు పైబడి వెచ్చించి భవనము నిర్మింప బూనియున్న శ్రీ కంచపాటి నారాయణగారి యౌదార్యము ప్రశంసించిరి. ఈ భవనమునకు స్థల సంపాదనకై పాటుబడు చున్న గ్రామోద్యోగులకును, పెద్దలకును కృతజ్ఞత దెలిపిరి. శ్రీమతి రామసుబ్బమ్మగారు ఆ గ్రామమున మహిళా సమాజము చేయుచున్న సేవా కార్యక్రమమును-ముఖ్యముగా ప్రసూతి చికిత్సాలయము ద్వారా చేయుచున్న సేవను ప్రశంసించిరి. దేశ రాజ్యాంగములోను స్త్రీలు మరింత ఆసక్తిచూపి తమ పాత్ర నిర్వహించవలయునని ఉద్బోధించిరి. ప్రత్యేకాహ్వానితులైన శ్రీమతి ఈడ్పుగంటి రత్నమాంబ గారు, శ్రీమతి చంద్రమతిగారు, శ్రీమతి సుజాతా రెడ్డిగార్లుకూడా మహిళా సమాజ సభ్యులను ప్రశంసించుతూ వారి కర్తవ్యములను తెలుపుచూ ఉపన్యసించిరి. మహిళా సమాజము అధ్వర్యమున జరుగుచున్న భజన, పురాణకాలక్షేపము వగైరా ఆధ్యాత్మిక కార్యక్రమమును విశేషించి అభినందించిరి. శ్రీ కే. ఆదికేశవులుగారు స్త్రీలు — జీవిత భీమాను గురించి వివరముగా ఉపన్యసించిరి.

## వవ్వేరు పంచాయతి బోర్డుకు అధ్యక్షురాలుగా శ్రీమతి వవ్వేటి విమలాదేవిగారి ఎన్నిక

నెల్లూరు జిల్లా వవ్వేరు గ్రామ సర్వ మహిళా పంచాయతి సభ్య ప్రథమ సమావేశంలో 31-8-56 న శ్రీమతి వవ్వేటి విమలాదేవిగారు అధ్యక్షురాలుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడిరి.

పలువురు అధికార, అనధికార ప్రముఖులు సభకు విచ్చేసిరి.

శ్రీమతి విమలాదేవిగారు తన్ను అధ్యక్షురాలుగా ఎన్నుకున్నందుకు ధన్యవాదములు నర్పించుచు ప్రప్రథమంగా భారత దేశంలో సర్వ మహిళా సభ్య పంచాయతిగా ఏర్పడిన తమ పంచాయతి అన్ని విధాల ఆదర్శప్రాయం కావాలనియు, దాన్నే తమకు అభినందన సందేశముల పంపిన ఆంధ్ర గవర్నరు శ్రీ త్రివేది, ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, మొదలగు పెద్దలు, మహిళా సమాజములు ఆశించుచున్నవని అధ్యక్ష స్థానమునుండి హెచ్చరించిరి.

తోటి సభ్యురాండ్రను పంచాయతి నిర్వహణలో వారి సహాయ సహకారముల నర్థించుచు బాధ్యతలను విధులను వివరించిరి.

పంచాయతి పరిపాలనా నిర్వహణ సులభ సాధ్యం కాని దేదియు లేదనియు, గ్రామంలో ఆరోగ్య సౌభాగ్యాల పెంపుదల కవసరమగు ఆరోగ్య వసతులగు పారిశుధ్యము, నివాసవసతులు, రహదార్లను నిర్మించుట, సాంఘిక సౌకర్యములులాంటి ఉద్యానవనములు, గ్రంధాలయములు నిర్మించుట, వైద్యవసతులను ఏర్పాటుచేయుటయే యనియు, యిట్టి కార్యకలాపములకు ఆర్థిక స్తోమతు అవసరము కాన గ్రామవాసులందరు బకాయిలు లేకుండా పన్నులను చెల్లించుచు అందమయిన గ్రామంగా వవ్వేరును రూపొందించడానికి తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేసిరి.

# 'రాగమయి'

## శ్రీ విజయ - రాఘవ

(గతసంచిక తరువాయి)

"అత్తయ్యా! నీ కంత మనసుగావుంటే రాగమయిని గురించి నీ కంతగా చెప్పవలసిన పనిలేదు. కాని, యీ రోజునిలా మనిద్దరికి జరిగిన విషయం గురించి దానికి ప్రస్తుతం తెలియనివ్వొద్దు. కొంతకాలంవరకు మనసులో వుంచుకో! బయట పెట్టామా, దాని చదువు చెడగొట్టిన వాళ్ళనవుతాం. తరువాత మరోవిషయం— శ్యామసుందరి వివాహం యీ సంవత్సరం మాఘమాసంలో జరిగేటట్లు చేద్దామని అందుకు నువ్వేమంటావ్?" అన్నాడు రఘునాథం.

"మంచి లగ్నాలుంటే అలాగే చేద్దాం. అన్నట్లు యెవరికీ!" అంది సుందరమ్మ,

"ఎవరో దాకా యెందుకూ? పార్వతీశం కొడుకున్నాడుగా కేశవుడు." అన్నాడు రఘునాథం.

సుందరమ్మకు అయిదు సంవత్సరాల చుట్టరికం గుర్తుకొచ్చింది. మొగం చిట్లించుకొంది. రఘునాథం మొగం వంక తేటగా చూడలేక, మరోవైపు చూస్తూ—

"రఘూ! వాళ్ళతో యేనాడో మామయ్యుండగానే బాంధవ్యం తెగతెంపులు చేసుకొన్నాం. ఏ మొగం పెట్టుకొని మళ్ళాబోయి వాళ్ళ కాళ్ళు బట్టుకోవటం, నాకిష్టంలేదు. చూస్తూ చూస్తూ శ్యామసుందరి గొంతుక్కి వురి వేయలేను. భగవంతుడు చల్లగా చూస్తే అయినప్పటికే అవుతుంది. వాడికిచ్చి సుఖపడేకన్నా, పరాయివాడికిచ్చి బాధపడటం మేలు. యీ సంబంధం సుతరామూ నాకిష్టంలేదు. వాళ్ళను గురించి నాకెటువంటి బాంధవ్యంకూడా అక్కర్లేదు. యిలా అంటున్నానని నువ్వు కష్టపెట్టుకోవద్దు. నువ్వు చిన్నవాడివి. వాళ్ళెటువంటివాళ్ళో నీ కింకా తెలియదు. మరోమారు తీరిగ్గా చెబుతాలే "అరుగో! అమ్మాయిలొస్తున్నారు." అంది సుందరమ్మ వీధి తలుపువంక చూస్తూ.

రఘునాథంకి తను చెప్పిన సంబంధం అత్తయ్య వొప్పుకోలేదని, నిష్కర్షగా కుండ బద్దలుగొట్టి చెప్పేసిందని కించిత్ కూడా కోపంరాలేదు. "వాళ్ళకూ— వాళ్ళకూ యేం మనస్పర్థలున్నాయో లోగడ, మనకేం తెలుసు" అని వూరుకొన్నాడు.

శ్యామసుందరి, రాగమయి సరాసరి లోపలికివస్తూ, రఘునాథంవంక రాగమయి తీయగా చూస్తే, శ్యామసుందరి చల్లగా చూసింది.

సుందరమ్మ తనలోతాను నవ్వుకొంది. రఘునాథం అదోలా చూస్తూ ముసి ముసిగా నవ్వుకొన్నాడు.

4

సుందరమ్మ సంసారాన్ని వేరుగావుంచి వాళ్లక్కావలసిన సౌకర్యాలన్నీ తనే సమకూరుస్తూ, లోకం అనుకునే మాటలకు కొంతవరకు బాధ్యుడు కాకుండా వుండాలని రఘునాథం కొంతవరకు ప్రయత్నించాడు. కాని అది మరో రూపంలో నెరవేరింది. "ఏమిటిరా! భగవంతుడా! ఒకవిధంగా తల్చుకుంటే మరోవిధంగా అయింది!" అని రఘునాథం నాలిక్కొరుకున్నాడు.

రఘునాథంకి యీ పరిస్థితులన్నీ యింటివద్ద వుండగానే తారుమారైనయి.

వేసంగి సెలవుల్లో సుందరమ్మ, శ్యామసుందరిని, రాగమయిని, చెల్లెలింటికి కోరితేనే పంపింది. కులాసాగానే వుంటున్నారని రెండుమూడుసార్లు మాత్రమే వుత్తరాలు వచ్చినయి. తరువాత కొంత కాలంవరకు వుత్తరాలేమీ రాలేదు. ఇలా వుండగా ఒకనాడు రఘునాథం పేరిట ఒక కవరు వచ్చింది. సుందరమ్మ ఆ కవరురావడం మామూలుగా రోజూ వచ్చే వుత్తరాలవంక చూసినట్లే చూసి తన పనిమీద తాను వెళ్ళిపోయింది. రఘునాథం ఆ కవరు విప్పి చదివి ఒక్క

నిట్టూర్పు విడిచి పిల్లిలాగా లోపలికి వెళ్ళి, సుందరమ్మకా వుత్తరం యివ్వబోతూండగా సుందరమ్మ ఆ వుత్తరం వంక చూస్తూ!—

"ఏమిటిరా! కబుర్లు!" అంది.

రఘునాధంకి జవాబెలా యివ్వాలో అర్ధంకాలేదు. ముఖ కవళికలనుబట్టి సుందరమ్మ వెంటనే గ్రహించి "నువ్వే చదువూ! యేంవుందో!" అంది.

"శ్యామకి క్షయవ్యాధి తగిలినట్లు రాగమయి వుత్తరం వ్రాసింది." అన్నాడు.

సుందరమ్మ గొంతులో యేదో అడ్డుపడినట్లుగా అయింది. మొగమంతా యెలా తెలాపోయింది.

"ఎప్పటినుంచీ"—అంది.

"ఇప్పటికి యెంతకాలంనుంచో వ్రాయలేదుగాని, మొత్తానికి యిక్కడకొచ్చిన కొద్దిరోజుల్నుంచి" అని వ్రాసింది.

"అయితే యీ విషయం రాగమయికెలా తెలిసింది?"

"ఎలాగేమిటి! అత్తయ్యా! ఆ వ్యాధివుండవలసిన లక్షణాలుబట్టి, అక్కడివాళ్ళంతా యిలా అనుకొని వుంటారు. విన్నమాటేమిటో వ్రాసింది." అన్నాడు.

"అయితే యెలా?"

"ఎలాగేమిటి! నువ్వేం కంగారు పడకు. బహుశా! ఆ వ్యాధి యింకా ఆరంభ దశలోనే వుండివుంటుంది. త్వరగా క్షయాసుపత్రిలో చేరిస్తే, తేలిగ్గా నయమవుతుంది."—అన్నాడు రఘునాధం.

సుందరమ్మను బుర్ర చెడిపోయే ఆలోచనలు ముసురుకొన్నాయి.

"ఏదో చేతికొచ్చింది గదా! యెక్కడో అక్కడ మంచిసంబంధాన్ని చూసి ఆ మూడుముళ్లువేసి, దాన్నొక యింటిదానిగాచేసి, కొంతవరకు హాయిగా వుందామని అనుకోవడమేమిటి!, భగవంతుడు యీ విధంగా నా మొగాన వ్రాయడమేమిటి! యిప్పుడు దానికొక్కవలసిన మందులూ, ఆసుపత్రిలో చేర్పించాలంటేనూ, ఎంత డబ్బు అవుతుందో తెలుసా! మళ్ళా వేరే కాపురం. యీ విధంగా వేరేపోతే నువ్వేమో! వొంటరివాడవు. చేతులు కాల్చుకొని తినటం జరుగుతుంది. యిదంతా యేమిటో రఘూ! నాకయోమయంగా వుంది. ఏం పాలుపోవడంలేదు." అంటూ సుందరమ్మ చెప్పుకొస్తూంటే, రఘునాధానికి యెలా నచ్చచెప్పాలో తోచలేదు. కాసేపు అటూ—యిటూ వంట యింట్లోపచార్లుచేయసాగాడు. మళ్ళా సుందరమ్మ దగ్గరకొచ్చి—

"అత్తయ్యా! అయితే యిద్దర్నీ బయలుదేరి రమ్మనమని వ్రాయమంటావా!" అన్నాడు.

"ఇంకా అక్కడెందుకూ! అనవసరంగా వాళ్ళనెత్తిన కూర్చొనివుంటే పదిమంది నానా విధాలుగా అనుకొంటారు. ఇప్పుడే యీ విధంగా వుండినందుకు బాధ పడుతూంటే - అదికూడా తోడైతే మరీ యేడ్వాలి. తొందరగా బయలుదేరి రమ్మన్నానని వ్రాసేయి" అంది సుందరమ్మ.

తెల్లవారటం జరిగిం తరువాత పోస్టాఫీసుకుపోయి కవరు కొనేంతవరకూ రఘునాధంకి యేం తోచలేదు. రెండు ముక్కలు తోచినట్లువ్రాసి, కవరు పోస్టులో వేసి యింటి ముఖం పట్టాడు.

సుందరమ్మ వాకిట్లోనే యెదురయి "కవరు వ్రాశావా!" అంది.

"ఆ... యిప్పుడే వ్రాసి డబ్బాలో పడేసి వస్తున్నా!" అన్నాడు రఘునాధం.

ఉత్తరం అందుకున్న మరునాడే శ్యామసుందరిని వెంటబెట్టుకొని రాగమయి జట్కాబండి దిగింది. బండి కిరాయి, రాగమయి దగ్గర చిల్లర లేకపోతే, రఘునాధమే యిచ్చి పంపించివేశాడు. శ్యామసుందరి మొగంవంక తేరిపార చూద్దామని రఘునాధం ప్రయత్నించాడు. "కాని రాగమయి యేమని ఆలో

చిస్తుందో యిలా చూస్తే” అనే బెరుకుతో పూరుకొన్నాడు. సుందరమ్మ అందించిన రెండు చెంబుల నీళ్ళతో కూతుళ్లిద్దరూ కాళ్లు కడుక్కున్నారు. రఘునాథం వాకిటి వసారాలో పడక కుర్చీలో పడుకొని యేదో ఆలోచిస్తున్నాడు. ఆరోజల్లా సుందరమ్మ శ్యామసుందరిని గురించి, రాగమయిద్వారా వినడమే సరిపోయింది, రఘునాథంకూడా వినక పోలేదు.

ఆ రాత్రి సుందరమ్మ బదులు రాగమయి వంట చేసింది. శ్యామసుందరి రొట్టె, పాలు త్రాగి పడుకొంది. రఘునాథం యేదో నలతపడినవాడు యెంగిలి పడ్డట్టుగా భోంచేసి, డాబామీద పడుకొంటానికి వెళ్ళిపోయాడు. సుందరమ్మ, రాగమయి ఒక్కమాటే అన్నానికి కూర్చొన్నారు. అన్నం తింటున్నంత సేపూ, సుందరమ్మ రఘునాథం మనస్తత్వాన్ని గురించి చూచాయగా చెబుతూ “శ్యామక్కయ్యకి రోగం నయమయ్యేంతవరకు తానే తప్పకుండా కావలసినంత డబ్బు సహాయం చేస్తానని మాటిచ్చాడు. ఆస్పత్రిలో చేర్చమని మరీ మరీ చెబుతున్నాడు. మరి నువ్వేమంటావ్” అని అడిగింది సుందరమ్మ యధాలాపంగా—

భోజనాలయినయి, తలుపులన్నీ జాగ్రత్తగా వేసి వచ్చి తల్లీ కూతుళ్ళు వాకిట్లో పడుకొన్నారు. రఘునాథం ఒంటరిగా పిండారబోసిన వెన్నెల్లో పడుకోలేక సతమతమవుతాడు. శ్యామసుందరి పడుకున్నదని రాగమయి, సుందరమ్మ నిశ్చింతగా వున్నారు. నిద్రలో ఘోరంగా దగ్గుతూనేవుంది శ్యామసుందరి. ఒక్కొక్క దగ్గు తెర డాబామీద మేల్కొనివున్న రఘునాథాన్ని భయపెడుతోంది. వూరంతా మాటుమణిగిపోయింది. రామాలయంలో భజనకూడా పూర్తయిపోయింది.

“నువ్వా ఆస్తంతా యెందుకిలా నాశనంచేయ దల్చుకొన్నావో మాకర్థంకావడంలేదు—,

“నువ్వు సంపాదించక పోబట్టేగా దాని విలువ తెలుసుకోలేక పోతున్నావు—,

“నిన్ను పిచ్చివాన్నిగాచేసి సుందరమ్మ ఆటలాడుతోంది—,

“చదువుకున్నందుకు కాస్తేమైనా ఆలోచించుకొని ప్రవర్తిస్తావేమో! అని అనుకున్నాం. కాని అటువంటి లక్షణాలేవీ నీలో కనిపించడంలేదు—,

“నీ ఆస్తంతా సర్వనాశనం చేయడానికే సుందరమ్మ తన సంసారంతో నీ నెత్తిమీద కూర్చొంది. ఉద్యోగం లేకుండా, పెళ్ళిచేసుకోకుండా, ఎన్నాళ్లిట్లా సుందరమ్మ సంసారాన్ని సాకుతూ కాలక్షేపం చేస్తావ్”—,

“రాగమయినిచ్చి పెళ్ళిచేస్తుందని భ్రమపడుతున్నావేమోగాని, సుందరమ్మ అటువంటి పనులేవీ చేసేమనిషికాదు. నాలుగురాళ్లు వున్నంతవరకు నిన్నంటిపెట్టుకొనివుండి, యెలాగో లాలించి, కావలసినప్పుడల్లా డబ్బుగుంజుతూ బ్రతుకు తెల్లార్చుకొని, యిద్దరి కూతుళ్ళకి పెళ్లిళ్లు చేద్దామని అనుకొంటోంది. పెద్దవాళ్ళం యేదో చెబుతున్నాం. యిక నామాట విని మంచిమార్గంలోకిరా.—

“సుందరమ్మ సంసారాన్ని దూరంగా వుంచడం చాలా మంచిది—.”

ఇక ఆ వుత్తరంలోని వాక్యాల్ని పునశ్చరణ చేయడానికి యిష్టపడలేదు. యిప్పటికే అప్రయత్నంగా కళ్ళవెంట నీళ్ళూరినయి. నిద్రదారి నిద్రపోయింది. యీ విధంగా తనకావుత్తరం వ్రాసిందెవరో అక్షరాలే చెబుతున్నాయి.

సుందరమ్మ మనస్సులోగాని, చేష్టల్లోగాని, చూపుల్లోగాని, మాటల్లోగాని, చివరకు యెటువంటి పరిస్థితుల్లోగానీ, వుత్తరంలో పేర్కొన్నట్లుగా కనిపించవేం. అటువంటప్పుడు తనా వుత్తరం చదవడానికి యెందుకుమళ్ళా యత్నించాలి? రఘునాథం యీ విధంగా అనుకొంటూ ఆ వుత్తరాన్ని రెండు ముక్కలుగా చించి పారవేశాడు.

యీ సంఘటన యిలా జరిగింది - రఘునాథం తన సొంత గదిలో ఆరోజు మధ్యాహ్నంపూట వుండగా.

అప్పటినుంచి పరి పరి విధాలు ఆలోచనలు పుట్టుకొస్తున్నాయి.

దశమి వెన్నెల మసక మసగ్గా జారిపోతోంది. రఘునాథం కళ్లు మూసుకొని యేదో పరధ్యాన్నంగా వున్నాడు. ఇంతలో రాగమయి డాబామీదికి మెల్లగా వచ్చింది—.

"బావా!" అంది – దగ్గరగావచ్చి—,

రఘునాథం హఠాత్తుగా కళ్లువిప్పి 'ఎవరూ! పాపా!' అన్నాడు.

రాగమయి నేలమీద కూర్చుంది. రఘునాథం మంచంమీదనుండి లేచికూర్చున్నాడు.

"ఏమిటీ రావడం పాపా! ఎవరైనా చూస్తారేమో అనే భయంకూడా లేకపోతే యెలా!" అన్నాడు రఘునాథం.

"ఎవరేమనుకొన్నా, నీతో కొన్ని విషయాలు మాట్లాడ్డానికి వచ్చాను" అంది రాగమయి.

రఘునాథంకి ఆ జవాబులో యేదో నిశ్చయం నిబిడీకరించుకొని వుందని ధ్వనిమాత్రంగా తెలిసింది. "అయినా హఠాత్తుగా యిటువంటప్పుడెందుకొచ్చింది." అనే దిగ్భ్రమ అతన్ని కంగారు పెట్టేసింది.

"ఏమిటా విషయాలు?" అన్నాడు రఘునాథం.

"అక్కయ్యను ఆసుపత్రిలో చేర్చే విషయం గురించి మాట్లాడుదామని"— రాగమయి.

"నిజంగా ఆ విషయానికి సంబంధించే వచ్చావా!"

"అవును"—

"అయితే దాన్నిగురించి యింకా మాట్లాడేదేమిటి? అన్నివిషయాలు అత్తయ్యకే చెప్పానుగా క్రొత్తగా యిప్పుడు నీతో చెప్పవలసిందేముంది?" అన్నాడు రఘునాథం.

"అయితే నీ విషయం?"

"నా విషయంగురించి నేనంతగా విచారించవద్దంలేదు. ముందు మా అక్కయ్య రోగం నయమయితే తర్వాత విషయాలన్నీ ఆలోచించుకోవచ్చు"

"మరి యెప్పుడు పట్నంవెళ్ళి ఆస్పత్రిలో చేర్పించడం?"

"రేపు నేను బయలుదేరివెళ్ళి అన్ని వివరాలు తెలిసికొని, మీరు వుంటానికి యిల్లొకటి మాట్లాడి రావాలిగా, అవన్నీ ముందు చక్కబెట్టుకొస్తే, తర్వాత అందరూ ఒక్కసారిగా వెళ్ళొచ్చు." అన్నాడు రఘునాథం.

రాగమయికి యిదంతా నమ్మవలసిన విషయంలాగే వుంది. బావ యెప్పుడూ మోసంచేసేమనిషి కాదని తెలుసు. కాని యెప్పుడేక్షణానికి మనుష్యులెట్లామారిపోతారో ఎవరూహించగలరు. పెళ్లిన మొహాన అడిగేద్దామనుకొంది ఒక్కసారిగా. ఆ వుత్తరం చదివినప్పటినుంచి హృదయంలో తనకేదో తీరని అవమానం పేరుకొనిపోయింది. చించి పారవేసిన వుత్తరం గాలికి యెటో అటూ కొట్టుకుపోక, వచ్చి వచ్చి తన చేతుల్లో పడి, తన మనస్సుని, శ్యామసుందరి అక్కయ్య మనస్సుని కలచివేసింది. నిజంగా రఘునాథాన్ని అడుగుదామనివచ్చిన విషయాలు తెలియకుండానే మరుగున పడిపోయి అనవసరమైనవి, తెలిసినవిచర్చగా మారిపోవటంలో రాగమయికి యెందుకో లజ్జ వేసింది. పైగా ఆ వెన్నెల్లో రఘునాథం వంక తీక్షణంగా చూద్దామనుకొనికూడా వ్యర్థురాలైంది. రఘునాథం బావలాగా కనిపించలేదు. పరాయివాడిలాగా, మోసగాడిలాగా కనిపించాడు. ఇదంతా తనకు భ్రమ అని తెలుసు. కాని మనస్సులో వుద్రేకం అలా అనిపిస్తోంది. ఇంత నమ్మకంతో, అక్కయ్య క్షేమం కోరుతున్నట్లుగా నటించుతూ, తనను 'పాపా' అని ముచ్చటగా పిలిచి, మురిపిద్దామనుకుంటూ వుండే రఘునాథం ఒక్కసారిగా యింత అఘాయిత్యంకి పాల్పడతాడా! ఇందులో యెంత వరకు నమ్మకంవుంది. రాగమయికి తల తిరిగిపోయింది.

(సశేషము)

# గ్రామ సీమలలో సంక్షేమ విస్తరణ కార్యక్రమాలు

## మాతా శిశువులపాలిట వరప్రసాదాలు

శ్రీమతి ఎ. సి. కృష్ణరావు

ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహాసంస్థ అధ్యక్షురాలు

భారతదేశంలోని గ్రామసీమలు దీర్ఘ కాలంగా నిర్లక్ష్యంచేయబడ్డాయి. ఈ నాడుకూడ అనేక గ్రామాలలో దారిద్ర్యం, నిరక్షరాస్యత, మూఢనమ్మకాలు, వ్యాధులు, అనారోగ్యం విలయతాండవం చేస్తున్నాయి. భారతదేశ జనాభాలో నూటికి 80 వంతుల ప్రజలు గ్రామ సీమ లలోవున్నారు. వారియొక్క కడుదుర్భర మైన పరిస్థితి మన ప్రజాస్వామిక ప్రభుత్వం గుర్తించి, తక్షణమే సమాజ వికాస కార్యక్రమాలను దేశవ్యాప్తంగా అమలు పరిచింది. ఆ కార్యక్రమాల ఫలితంగా గ్రామ ప్రజల ఆర్థిక, సాంఘిక పరిస్థితులు త్వరత్వరగా చక్కబడుతున్నాయి. గ్రామాలలో యీనాడు మంచినీటి బావులు, చెరువులు, స్కూళ్లు, చక్కని రోడ్లు నిర్మించబడుతున్నాయి. గ్రామ ప్రజలకు వైద్య సహాయం కల్పించబడింది. సమాజ వికాస కార్యక్రమాల ప్రయోజ నాలను గ్రామ ప్రజలు యీనాడు పొందుతున్నారు.

మహిళా సంక్షేమం, శిశు సంక్షేమం, కుటుంబ సంక్షేమం మొదలైన సంక్షేమ రంగంలోని యితర కార్యకలాపాలను కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ అధ్వర్యం క్రింద జయప్రదంగా నిర్వహించబడు తున్నాయి. సంక్షేమ కార్యక్రమాలు ఇంతకుముందు లేనటువంటి ప్రాంతాలలో కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ సంక్షేమ విస్తరణ పథకాలను అమలుపరుస్తున్నది.

### గ్రామాలలోని పరిస్థితులు

మారుమూల గ్రామాలలోని పరిస్థితు లనుచూస్తే, ఎవరికైనా హృదయం ద్రవించిపోతుంది. అక్కడి ప్రజలు కడు దుర్భరమైన జీవితాలను గడుపుతున్నారు. దారిద్ర్యం, అనారోగ్యం, వారినిపట్టి పీడి స్తున్నాయి. అజ్ఞానంవల్ల దారిద్ర్యం, దారిద్ర్యంవల్ల అనారోగ్యం, అవిద్యవల్ల అజ్ఞానం పెంపొందుతున్నాయి. వారి కంటె మేధావంతులు, నాగరీకులు అయిన ప్రజలనుంచి వారిని వేరుచేయబడడంవల్ల, గ్రామ ప్రజలు అట్టి దుర్భర పరిస్థితు లలోవున్నారు.

అట్టి మారుమూల గ్రామాలలో పూరి గుడిసెలలో నివసించే స్త్రీకి పొట్ట పొడి చినా అక్షరంముక్కలేదు. యుగాల నుంచీ ఆచరణలోవున్న ఆచారాలు,

సంప్రదాయాలు, మూఢ నమ్మకాలు ఆమెను బానిసత్వంలో వుంచుతున్నాయి. తన శక్తికిలోబడి ఆరోగ్యకరమైన, సుఖప్రదమైన జీవితం గడపడానికి ఆమెకు మార్గం చూపేవారు ఎవరూ లేరు? గర్భిణీతో వున్నప్పుడుగాని, ప్రసవ సమయంలోగాని ఆమెకు ఎట్టి సౌకర్యాలు లేవు. పుట్టిన పిల్లలు గాలికి బ్రతక వల్సిందే. ఆ పిల్లలు బ్రతికితే బ్రతుకుతారు; లేకపోతే లేదు. ఆమె జీవితం చుక్కానిలేని నావలాంటిది. ఇట్టి స్త్రీ మూర్తి తన కుటుంబ చక్రానికి ఇరుసు వంటిది. తన కుటుంబంయొక్క ఆరోగ్యం, శ్రేయస్సు, అన్నీ ఆమెమీదే ఆధారపడి వున్నాయి. కేంద్ర సాంఘికసంస్థ అమలు జరుపుతున్న సంక్షేమ విస్తరణ కార్యక్రమాలలో ఆ స్త్రీ మూర్తికే అత్యధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. ఆ స్త్రీ యొక్క విద్య, ఆరోగ్యం, శిశుసంరక్షణ, విషయాలలో ప్రత్యేకశ్రద్ధ తీసుకోబడుతున్నది. ఆమెకు, ఆమె పిల్లలకు జీవనోపాధి కల్పించి తద్వారా ఆమె కుటుంబానికి సహాయం చేయడం జరుగుతున్నది.

దేశం మొత్తంమీద అన్ని ప్రాంతాలలోను ప్రజల అవసరాలు ఒకే విధంగా వున్నందున, రాష్ట్రానికీ, రాష్ట్రానికీ ఎక్కువ తేడాలు లేనందున కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ, ఒకే విధమైన ఒక సమగ్రకార్యక్రమాన్ని రూపొందించి, దానిని అమలుపరుస్తున్నది.

## సంక్షేమ విస్తరణ పథకాలు

1954 ఆగస్టునుంచి యిప్పటివరకూ, సుమారు 300 సంక్షేమ విస్తరణ పథకాలకు ప్రారంభోత్సవం జరిగింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలం ముగిసేసరికి 1320 ప్రాజెక్టులను అమలు జరపాలని నిర్ణయించబడింది. ప్రతి జిల్లాకు నాలుగేసి ప్రాజెక్టులను అమలు జరపాలని సంకల్పించబడింది. ఒక్కొక్క ప్రాజెక్టుకు మూడు సంవత్సరాలకు ఒక లక్ష రూపాయలు కావాలని అంచనా వేయబడింది. ఆ మొత్తాన్ని కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, రాష్ట్రప్రభుత్వాలు, ప్రజలు 2:1:1 నిష్పత్తిలో సమకూర్చగలవు.

ఒక్కొక్క ప్రాజెక్టుక్రింద సుమారు 25 గ్రామాలు వుంటాయి. సుమారు 25,000 మంది ప్రజలు ఆ ప్రాజెక్టుయొక్క ప్రయోజనాలను పొందుతారు. చేసిన పనినే తిరిగిచేయకుండా వుండే నిమిత్తం, సమాజ వికాస కార్యక్రమాలులేని ప్రాంతాలలో యీ పథకాలు అమలు జరుపబడుతున్నాయి. ఐదేసి గ్రామాలకు ఒకటి చొప్పున బహుళ ప్రయోజనాలు కలిగించేటటువంటి ఐదు కేంద్రాలు ఒక్కొక్క ప్రాజెక్టుక్రింద నెలకొల్పబడతాయి. ఒక్కొక్క కేంద్రంలో ఒక

గ్రామసేవిక, శిక్షణపొందిన ఒక దాయి లేక మంత్రసాని, వృత్తిలో శిక్షణయిచ్చే ఒక అధ్యాపకురాలు వుంటారు. ఆ ప్రాజెక్టుయొక్క ప్రధాన నిర్వాహకుడు, ప్రధాన మంత్రసానుల ఆదేశాలకులోబడి ఆ కేంద్రాలు పనిచేస్తాయి. ఆ ప్రాజెక్టు యొక్క పరిశీలన సంఘాలు అక్కడ సాగుతున్న కృషిని అజమాయిషీ చేస్తూ వుంటాయి.

శిక్షణపొందిన సిబ్బందీ తగినంతమంది లేనందున, యీ కేంద్రాలలో పనిచేయడానికి 3,000 మంది గ్రామ సేవికలను, 1600 మంది మంత్రసానులను, 6,000 మంది దాయీలను తయారుచేయడానికి కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ పూనుకొన్నది. ఒక ప్రత్యేక గుమాస్తా ఆ ప్రాజెక్టును సంబంధించిన వ్రాతకోతలను నిర్వహిస్తాడు. రవాణా అవసరాలకు ఒక ప్రత్యేకజీపు వుంటుంది. ఒక సమావేశకర్త అధ్యక్షతక్రింద, కేంద్ర నిర్వహణానుభవంగల 12 మంది అనధికార ప్రజాసేవకులతో కూడిన ఒక సంఘం యీ ప్రాజెక్టు వ్యవహారాలను పరిశీలిస్తుంది. అట్టి శాఖలను నిర్వహించే ప్రభుత్వోద్యోగులను ఎక్సుఅఫీషియో సభ్యులుగా తీసుకొని, ఆ జిల్లాలోని ప్రాజెక్టుల నిర్వహణ వారి అజమాయిషీ క్రింద కొనసాగించబడుతుంది.

## కొన్ని ఇబ్బందులు

ఈ పథకం అత్యంత ఆకర్షణీయమైనదీ, సక్రమ పంథాలో రూపొందించబడినదీ, అయితే ఆ పథకాన్ని ఆచరణలో పెట్టే సందర్భంలో కొన్ని సమస్యలు ఏర్పడతాయి. విశేషధైర్య సాహసాలు, సహనశక్తి, స్థిరసంకల్పం, ఆ కృషి జయప్రదం కావడానికి అత్యవసరం. ప్రాజెక్టు సంఘాలలోని సభ్యులు, నిర్వహణ సిబ్బందీ పై శక్తులను ప్రదర్శించకపోతే పలాయన మంత్రం పఠించవల్సివస్తుంది.

ఉదాహరణకు ఆంధ్ర రాష్ట్రంలోని గ్రామాలలో ప్రయాణంచేయడానికి జీపు పనికిరాదు. ఎందువల్లనంటే అనేక గ్రామాలకు జీపు వెళ్లేమార్గంలేదు. మామూలుగా కాలిమార్గం మాత్రం వుంటుంది. వర్షాకాలంలో కాలినడకను కూడ కొన్ని గ్రామాలకు వెళ్లడానికి అస్కారంలేదు. గ్రామ ప్రాంతాలకు వెడుతూవుంటే, ఒక్కొక్కప్పుడు అకస్మికంగా వరదలువచ్చి, ఆగిపోవల్సి వస్తూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు మురుగు కాలువలు అడ్డంవచ్చి, నిల్చిపోవలిసి వస్తూ వుంటుంది. నగరవాసానికి అలవాటుపడి, పనిచేయడానికి పల్లెటూరు వెళ్లిన స్త్రీకి యిదంతా చూస్తే ఖంగారుగా వుంటుంది. అయితే తనతోటి

మహిళలకు సేవచేయాలనే సంకల్పం ఆమెకు ధైర్యసాహసాలను కలిగించి ముందుకు తీసుకువెడుతుంది. కాలు జారుతూవుండే మిట్టపల్లాలుగల మార్గం, సన్నటి చెరువుకట్టలు, దారిడొంక కన పడని అరణ్యాలు, చలి, అత్యుష్ణం మొదలైనవేవీ ఆమె వజ్రసంకల్పాన్ని మార్చ లేవు. ఆమె ఆశా సౌధాలను కూల్చ లేవు.

ఈ సేవిక గ్రామంలో అడుగుపెట్టగానే, గ్రామ ప్రజలు ఆమెను అనుమానంతో చూస్తారు. ఓట్లయాత్రకోసం వచ్చిన వనిత అనుకొంటారు. వారి సంక్షేమం కోసం పాటుపడడానికి వచ్చానని వారికి నచ్చచెప్పడానికి ఓర్పు, నేర్పు అవసరం. వారికి అన్ని విషయాలుచెప్పి, ఏవిధమైన వైద్య సౌకర్యాలూలేని గ్రామాలలో శిక్షణపొందిన దాయీ వుంటే కొంతలో కొంత నయమని గ్రామ ప్రజలకు నచ్చ చెప్పాలి.

గ్రామాలలో సంక్షేమ కార్యక్రమా లను అమలు జరపడానికి గ్రామ ప్రజల వాటాక్రింద వారివద్దనుంచి డబ్బు వసూలు చేయడం అతికష్టమైనపని. గ్రామ ప్రాంతాలలోని ప్రజలు డబ్బు యివ్వ లేరు. ఇతర ప్రాంతాల ప్రజలు డబ్బు ఇవ్వగలిగినా, ఆ డబ్బుని మందులకు ఆహార పదార్థాలకు, పెట్రోలుకు ఖర్చు కావడానికి అంగీకరించరు. వారు యిచ్చే విరాళాలకు శాశ్వతమైన భవనాలు కావా లంటారు. ప్రాజెక్టు నిర్వహణకు సంఘాల వారు గ్రామ ప్రజలను ఉత్తేజపరిచి, వారు సుముఖత్వాన్ని చూపేటట్లుచేసి,, వారి వద్దనుంచి విరాళాలను తీసుకొంటారు.

ఈనాడు యిట్టి కేంద్రాలలో చాల వాటికి శాశ్వత భవనాలు ఏర్పడ్డాయి. స్థానిక అభివృద్ధిపథకాలక్రిందగాని, కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ సహాయంతోగాని ఆ భవనాలు నిర్మించబడ్డాయి. సాంఘిక విద్యాబోధన, వృత్తిశిక్షణ శాఖలకు అవ సరమైన హంగులన్నీ సమకూరాయి. అత్యవసర సందర్భాలలో ఒకటి, రెండు ప్రసూతి కేసులను నిర్వహించడానికి అవ సరమైన పరికరాలు ప్రసూతి కేంద్రంలో వున్నాయి. దక్షీపని సర్వసాధారణంగా అన్ని కేంద్రాలలోను నేర్పబడుతున్నది. ప్రజలందర్నీ ఒకచోటచేర్చి, ఆ ప్రాజెక్టు లంతా ఉమ్మడి వ్యవహారమని వారికి నచ్చ చెప్పే బాధ్యత అంతా ముఖ్యసేవికపైన ఉన్నది. ప్రాజెక్టు నిర్వహణ సంఘాల సభ్యులు ప్రవీణులైన వైద్యులు, అధ్యాప కులు, వృత్తిశిక్షకులను వెంటబెట్టుకొని ఆ కేంద్రాలకువెళ్ళి సలహాలిస్తారు.

గ్రామ సేవకుడు ఇంటింటికివెళ్ళి, అవ సరమైన సహాయం చేయడంవల్ల ప్రజలు తమ అభిప్రాయాలను అతనికి హృదయం

విప్పి చెప్పడానికి అవకాశం ఏర్పడుతున్నది. ఈ పథకం విజయవంతం కావడానికి అట్టి పరస్పర సామరస్యం ప్రధాన కారణం. గ్రామ సేవికలు మానవ కారుణ్య దృష్టితో గ్రామ ప్రజలపట్ల వ్యవహరించి వారికి సేవచేయడంవల్లనే పనిపాటలు చేసుకొనే తల్లి తన పిల్లలను బాలల వినోద కేంద్రంలో విడిచిపెడుతున్నది. పాఠశాలలో ఇంకా చేరనటువంటి పిల్లలు 'బాలమంది'కి ఎగబడుతున్నారు. గ్రామ స్త్రీలు తమ తీరిక సమయాన్ని ఆ కేంద్రంలో ప్రయోజనకరమైన పనులకు వినియోగిస్తున్నారు; గర్భిణీ స్త్రీగాని, బాలెంత స్త్రీగాని మాతా శిశు సంరక్షణ కేంద్రానికి వెళ్లి సలహాలను పొందుతున్నది.

అక్కడ పనిచేస్తున్న సిబ్బంది శిక్షణ పొందినవారైనా, కాకపోయినా, యీ కృషియందు ప్రత్యేకమైన అభిరుచిగలవారు. పల్లెటూళ్ల యిబ్బందులను ఎన్నడూ చవిచూడనటువంటి, అనేకమంది కన్యలు సేవానిరతితో, కన్నవారిని వదలిపెట్టి, గ్రామాలకు పరుగులెడుతున్నారు. అక్కడ అనారోగ్యం, అసౌఖ్యం, మొదలైన వాటిని భరించి సేవచేస్తున్నారు.

ఈ కార్యక్రమం ప్రశంసనీయమైన ఫలితాలను కొన్నింటిని సాధించింది. మరి కొన్ని క్రమంగా సాధించబడుతున్నాయి. స్త్రీలు సేవాశిక్షణ పొందడానికి, సేవచేయడానికి యిది అపూర్వ అవకాశం. అనేక వేలమంది చదువుకొన్న స్త్రీలు, ఆడంబర జీవితాలకు స్వస్తిచెప్పి, సాంఘిక సేవకు తమ జీవితాలను అంకితంచేసి, గ్రామీణ భారతదేశంయొక్క స్వరూపాన్ని మార్చి వేయడానికి దృఢసంకల్పులై నిలవడం నేత్రపర్వంగా నున్నది. గ్రామ స్త్రీలలో నవచైతన్యం పెల్లుబికి, ఆ ప్రాజెక్టు కేంద్రం తన పాలిట, తన పిల్లలపాలిట వరప్రసాదమనే విశ్వాసం ఏర్పడింది. సంక్షేమ విస్తరణ పథకంయొక్క అంతిమ విజయం ఆ విశ్వాసంపైనే ఆధారపడి వున్నది.



# ఆరోగ్యానికి తోట పెంపకం

శ్రీ 'అర్జున్'



ఆరోగ్యానికీ - ఆనందానికి నిలయం అందమైన ఉద్యానవనం. పచ్చని కొమ్మలతో, విరబూచిన పూలతో వూగిసలాడే పచ్చని పూల మొక్కల్ని చూచి ఆనందించని మానవుడు లేడనవచ్చు. ఏ ఉద్యాన వనాన్నయినా మెచ్చి సరిపోల్చడమే అయితే అది తప్పక 'నందనోద్యాన వనం' అని పిలుస్తాము. మన గృహాల్లో అలాంటి నందనవనాలన్ని, పెంచడం అనేది ఒక సమస్యే ! ఆరోగ్యానికి తప్పని సరిగా పెంచక తప్పదు. అదే విషయాన్ని మిస్టర్ ఫ్రాయిడ్ బ్రాల్లి యర్ పి.హెచ్.డీ. ఒక వ్యాసంలో వివరించాడు— అందులోనే 'ఆరోగ్యానికి తోటపని' అని కొన్ని సూచనలు చేసాడు.

'ప్రతి వేసవి కాలంలో మనకు నలువైపులునుండి మన మిత్రులవద్దనుంచి వచ్చే వుత్తరాలలో — ముఖ్యంగా కానవచ్చే విషయం వేసవి ఎక్కువగా వుందని, ఎండ వేడిమికి పచ్చని మొక్కలుకూడా నశించి పోతున్నాయని, వాటిని ఏలా పెంపొందించాలో ఏలా ఉద్ధరించాలో తెలియజేయమంటూ కోరేవి ఏల్లో కొల్లలుగా వుంటాయి. ఎండ వేడిమికి మల మల మాడిపోయిన మొక్కల్ని తిరిగి బ్రతికించడం అంటూ లేదు. సామాన్యంగా మొక్క నిలువునా సర్వస్వం ఎండిపోయి చచ్చిపోయుంటే — అదేదో ఒక రకమైన తెగులు తగిలి చనిపోయిందనుకొంటాం మనం. అది సహజంకూడా. ప్రతివారు భావించేది అదే. కాని అది నిజమైన కారణ మెన్నటికీకాదు. మనం ఉద్యానవనంలో మొక్కల పెంపకానికి కనుపరచవలసిన శ్రద్ధ కనుపరచకపోవడమే అవి ఆలా క్షీణించి పోవడానికి కారణం. నిజంగా అశ్రద్ధవల్ల చనిపోతున్నాయి— లేక వ్యాధివల్ల చనిపోతున్నాయని-అని జరిపిన పరిశోధనలో ప్రతి పది మొక్కలికి తొమ్మిది అశ్రద్ధవల్లనే నశించిపోతున్నాయనే రుజువైంది. వేసవి కాలంలో మరీ ఎక్కువగాను.

♦ ♦ ♦

మండు వేసవికాలంలో పగలెల్లా వడిగాలికి విసుగెత్తిన మానవుని సాయంత్ర సమయమున నైనా చల్లగా హాయినిచ్చే ఏ ఉద్యానవనంలో కూర్చుంటే ఎంత ఆనందంగా వుంటుంది! కాని సూర్యుడు మొక్కల్ని తను బలిగొంటున్నాడా అని ఆలా మొక్కలు సూర్యుని బలిగాకుండా మార్గం అన్వేషించాలి.

ప్రతి ఉదయం — సూర్యోదయానికి పూర్వమే మొక్కలికి నీరు పెట్టడం మంచిది. లేకపోయినయెడల మొక్కల్లోని టిష్యూలు మనం పెట్టిన నీటిని నింపుకో లేక పోవడం, త్వరగా అభివృద్ధి చెందకపోవడం సంభవిస్తాయి. మొక్క ఏపుగా పెరుగదు. వేడి తేమలేని పొడిగాలులు వీచే రోజుల్లో, శీతాకాలపు రోజుల్లో మొక్కలలోని టిష్యూలు సెప్ (sap వాటర్‌తో పరిపూర్ణంగా నిండి యుండక పోయిన యడల, వేసవికాలంలో మొక్కనుండి బయలుదే నూతన రెమ్మలు, కొమ్మలు పెరగక పోవడమేగా అసలు మొక్కే నశించిపోవచ్చు. ఈ లాంటి శీతాకాలపు కడపటి రోజుల్లో బయలుదేరి వేస మధ్యకాలంలోగాని బయల్పడదు. ఈలాంటి క్షీణించ దశలు ఎక్కువగా బాక్స్‌వుడ్ - జాతికి సంబంధి చిన మొక్కల్లోనిపిస్తుంది.

మన దేశంలోని దక్షిణపు ప్రాంతాల్లో ముఖ్యంగా చిన్న చిన్న పూల మొక్కలు, పచ్చని చెట్లు విశాలమై, మైలు పొడుగునా చల్లని ఛాయలిచ్చు వృక్షాలు గూడా - అవి పాతిపెట్టిన సంవత్సరాంత

పరస క్రమం తప్పక ప్రతినిత్యం వాటికి నీరు పెట్టటం ముఖ్యం. చెట్టుకు నీటితేమ వుంటేగాని ఆహారాన్ని సంపాదించుకోలేదనే సామాన్య విషయం అందరికీ తెలిసిందే.

ఇక మొక్కకు చక్కటి పాదులు తీయటం ఒక పని. వాటికి చిన్నచిన్న కాలువలు నీరు ప్రవహించే మార్గం ఏర్పరచడం రెండవ పని. మొదటిసారి నీరు పెట్టిన, 4, 5 దినాలవరకూ నిదానించి, ఆ తరువాత మొక్కకి నలువైపులా - పాదులు తవ్వాటించి, మొక్కకు చుట్టూ వెడల్పాటి గొయ్యితీసి, ఆ మొక్క వేళ్లు ప్రాకినంతకు లోతుకన్నా కొంచం లోతుగా మన్నుతీసివేసి, మన పేడ కుప్పల్లో - సగం సగం క్రుగ్గి అప్పుడే ఎరువుగా మార్పు చెందుతన్న గడ్డిని తెచ్చి- మనం తీసిన ఆ గొయ్యిలో పెట్టి మన్ను కప్పాలి. ఆవిధంగా చేయడంవల్ల మొక్కకి కావలసిన తేమ లభ్యమవడమేకాక వేళ్లు సమగ్రమైన ఉష్ణోగ్రత వుండడానికి వీలుకలుగ జేస్తుంది. ఈ పని వేసవి కాలంరాకముందే చేయాలి. అంటే నవంబర్, డిశంబర్ మాసాల్లో జరపాలి.

ఈలా శీతాకాలంలో ఏర్పాటుచేస్తే, దానివల్ల మొక్కను ఎంతో అభివృద్ధిచెందడానికి కారణభూతులవుతారు. మొక్క మొదల్లో కప్పిపెట్టబడిన మాగిన గడ్డి మన్నులోకలిసి రసయానికి పరివర్తన చెంది చక్కటి ఎరువుగా రూపొందుతుంది. ఆ ఎరువే మొక్క జీవనానికి ముఖ్యాధారం. మాగి కుళ్లిపోయినగడ్డి - సూర్యవేడిమికి మొక్క కాండం (స్టెమ్) నుంచి తేమను ఆవిరికాకుండా అరికట్టడమే కాక నిత్యం మొక్కకి - తేమను కలిగియుండేలా పరిస్థితుల్ని కలిగిస్తూంది. మనము కనుక మొక్కలను సరిగా - వాటి మొదళ్లలో పాదిగట్టి నీరు పెట్టారంటే - వేసవికాలంలో మొక్కలు - వాడిపోనూ పోవు - అంతేకాక - ఎండిపోయిన రెమ్మలుగాని, కొమ్మలుగాని లేక - పకపక నవ్వించే పచ్చని కొమ్మలు - పూలతో విరబూచి వుండడం కనిపిస్తూంది.

పుష్పజాతి మొక్కలికి ఏకరీతిగా తేమ వుండాలనేది ముఖ్యం. ఎండాకాలంలో, మొగ్గలు - పూపూయకనే రాలిపోవడంకద్దు. రాలిపోయిన మొగ్గలైనా ప్రాణంతోవుండి పుష్పించి శోభించాలంటే అవి శీతాకాలంలో చక్కగా వాటి టిష్యూలను నీటితో నింపి వుండాలి. చాయా వృక్షాలు చిన్న చిన్న పొదరిళ్లకు - శీతాకాలంలో సులభపదతిన ఎరువువేయడం నేర్చుకోవాలి - ఒకవేళ శీతాకాలంలో ఎరువువేయడమే జరిగిపోయివుండి - తిరిగి వేసవిలోకూడా జరిగిందంటే మొక్క పెరుగుదల ఆలస్యానికి గురి అవుతుంది. అసలు మొక్కకి దెబ్బ అందువల్ల ఆ మాత్రం వేసవికాలంలో తగురీతిగా ఎరువువాడకం జరపాలి.

వేసవికాలంలో మొక్కకు వేయతగిన - పేడ, పెంట, మొదలగునవి, మంచి ఎర్రరేగడి మట్టితో కలిపి - పాదుల్లో అంతకుముందు వుంచిన, గడ్డిని తిరిగి వెలుపలికితీసి - ఆ గడ్డిని - మనం తయారుచేసిన ఎరువుతో మిశ్రంచేసి తిరిగి గడ్డితోపాటు అడుగు భాగమున పూడ్చిపెట్టాలి. ఆ విధంగా చేయడంలో ఒకొక్కసారి మొక్కకువున్న వేళ్లు తెగిపోవడం జరుగుతుంటుంది. అందువల్ల ఆ పని ఆచరించేటప్పుడు చాలా సున్నితంగా జరపాలి. తిరిగి మొక్కకి పాది కట్టాలి. పైవిధంగా మొక్కకి తగిన శ్రద్ధతో కృషి సలిపినప్పుడు మన యిండ్లలోగూడా నందనవనం ఏర్పాటుచేసుకోవచ్చు. అందుకనే 'తోటపని ఆరోగ్యదాయకం' అన్నారు.



# గాలిమేడలు

శ్రీ "ఏకా"

శంకరయ్యగారిది బాగా బ్రతుకుచున్న సంసారం. కానీ, కాలం కలిసిరాలేదు. హటాత్తుగా భార్యా, రెండు సంవత్సరముల కుమారుడు రామూను, ఈ లోకమునవదలి స్వర్గస్థులయినారు. ఇక భార్య శారదమ్మగారికి కష్టకాలము దాపరించింది. ఆమె తన కుమారునికొరకే ఈ భూమి మీద బ్రతకవలసివచ్చెను. నా అనువారు లేకపోయిరి. ఎట్లయిననూ రామూను వృద్ధిలోనికి తెచ్చుటే ఆమె ఆశ. కుమారునకు అయిదు సంవత్సరములు రాగానే విద్యాభ్యాసమున ప్రవేశపెట్టెను. ఆమె గొప్ప, గొప్ప వారిండ్లలో మానాభిమానములన్నియూ వదలి, వంటలు చేయూచూ తన కుమారుని పోషించుకొనవలసివచ్చెను. రామూకూడా బడిలో శ్రద్ధగా చదువుకొనుచుండెను. ఆమెకు ఒక్కటే కోరిక. తను ఎన్ని కష్టములకయిననూ ఓర్చి కుమారుని వృద్ధిలోనికి తెచ్చుటయే ఆమె కోరిక,

రామూను ఒకటవ ఫారమందు ప్రవేశపెట్టెను. పాఠశాలకు ప్రతిదినమునూ వేళకుపోయి, ఇంటికివచ్చి బాగుగా చదువుకొనుచుండెను. ఇది అంతయూచూచి, తల్లి తన కష్టములన్నియూ మరచిపోయి ఆనందించుచుండెడిది. రామూకూడా ఎల్లప్పుడునూ తల్లి మాటలకు ఎదురుచెప్పకుండా, నడుచుకొనుచుండెడివాడు. ఉదయమునసే నిద్రలేచి ముందుగా తల్లి పాదములకు నమస్కరించి పాఠశాలకు వెళ్ళుచుండెడివాడు.

రామూ ఒకటవఫారం కృతార్థుడయినాడు. పాఠశాల అందరిలో మొదటివాడుగా కృతార్థుడయినాడు. మరుసటి సంవత్సరము రెండవఫారం చదువుచున్నాడు. పాఠశాలాధికారులు జీతం లేకుండా ఏర్పాటుచేసినారు.

నాల్గుసంవత్సరములు గడిచిపోయినవి. రాము స్కూలుఫైనలు ప్రభుత్వ పరీక్షలకు హాజరయినాడు. పరీక్షలు బాగానే వ్రాసానని తల్లికిచెప్పి ఆనందము కల్గించినాడు. శారదమ్మగారికి ఆనందమునకు మేరలేదు. ఆమె ప్రసాదరావుగారను ఒక లక్షాధికారి గారింటిలో వంట చేయుచూ కుమారుని వృద్ధిలోనికి తీసుకొనివచ్చినది. యజమానికిగూడా ఆమె, రామూ అన్న మంచి గౌరవము. ఆయన ఎప్పుడునూ "నీకొడుకుకేమమ్మా! మంచి అదృష్టవంతుడు" అని అంటూ ఉండేవారు. ఆయునకు ఒక్కతే కూతురు పేరు జానకి. రామూ, జానకీ ఒకటే క్లాసు, ఒకే సెక్షను. ఇద్దరునూ కలిసి చదువుకుంటూ ఉండేవారు. రామూయొక్క తెలివితేటలకు మెచ్చుకొని

ప్రసాదరావుగారు చాల ధనసహాయము కూడా చేసినారు. శారదమ్మగారుకూడా వారి ఇంట్లోనే ఉంటూ వచ్చారు.

పరీక్షా ఫలితాలు పత్రికలందు ప్రకటించారు. రామూ ప్రొద్దుననే బజారుకు పోయి దినపత్రిక తీసుకొని ఆనందముతో ఇంటికి తిరిగివచ్చాడు. తల్లిపాదములకు నమస్కరించాడు. తర్వాత పెద్దవారగు ప్రసాదరావుగారికి నమస్కారముచేసాడు. ఆయనగారు చాలా సంతోషించారు. కానీ, ఆయనకు ఒక్కటే విచారము. తన కుమార్తె జానకి మాత్రము కృతార్థురాలు కాలేదు. పాపం! జానకి తండ్రికి మొహము చూపించలేకపోయింది. జానకి తల్లి కుమార్తెను ఓదార్చింది. ఈ తడవ కాకపోయిన ఇంకొక తడవ చదువవచ్చని ఓదార్చింది. రెండు దినములలో మార్కులుకూడా తెలిసినవి. రామూ, పరీక్షలకు హాజరయిన వారందరిలో ప్రథముడుగా కృతార్థుడయినాడు. ప్రభుత్వం రామూకు ఒక బంగారు పతకం బహూకరించారు. అది దినపత్రికలందు ప్రకటించబడింది. బంగారు పతకం పాఠశాలవారికి అందచేసారు. ఒకనాడు పాఠశాల ఆవరణలో బహిరంగ సమావేశము జరిపి రామూకు బంగారు పతకం బహూకరించారు. అందరున్నూ రామూయొక్క తెలివితేటలను పొగడారు. ఆ సమావేశమునకు ప్రసాదరావుగారే అధ్యక్షులు. వారు చివరకు మాట్లాడుచూ రామూ కాలేజి చదువు అయినంతవరకూ తానే ఖర్చంతయూ భరించెదనని చెప్పినారు. హర్షధ్వానులతో పాఠశాలంతయూ మారు మ్రోగింది. ఇది అంతయూ తల్లి శారదమ్మగారు చూడలేదుగాని, విని చాలా ఆనందించింది.

ఒకరోజు శారదమ్మగారిని ప్రసాదరావుగారు ఒంటరిగా పిలిచి రామూ చదువు విషయమై హెచ్చరించారు. "ఇంకా చదువెందుకు బాబూ! ఏదో మీ దయవల్ల ఇంతవాడయినాడు. మీరే నా కుమారునకు ఉద్యోగము ఇప్పించండి. మీ పేరు చెప్పుకొని బ్రతుకుతాము" అని శారదమ్మగారు అన్నారు.

"ఇదుగో! శారదమ్మగారూ! మీరు ఏమియూ అనుకోకుండా ఉంటే నేనొక్కటి చెప్పుతాను. మీరు కాదనగూడదు."

"ఏమిటో చెప్పండి. ఇంతవరకూ మీ దయవల్లనే వృద్ధిలోనికి వచ్చాడు. మీరు ఇచ్చు సలహాలకు నేనెన్నడునూ కాదనను. చెప్పండి?"

"అయితే చెప్తాను వినండి. రామూ చాలా తెలివయినవాడు. వృద్ధిలోనికి రావలసినవాడు. నాకా కుమారులులేరు. ఒక్కతే ఒక్కకూతురు. మిమ్ములను ఈ వృత్తినుండి విరమింపచేయదలచుకున్నాను. అంటే, నేను మీ కుమారుని అల్లునిగా చేసికొనదలచాను. చిన్నప్పటినుండి నా

ఎదురుగానే పెరిగాడు. జానకికి గూడా రామూ అంటే చాలా ప్రాణం. రామూ, ఎంత చదువు చదువుకొన దలచినను, చెప్పించదలచుకున్నాను. జానకినిగూడా మరల స్కూలులో చదివించదలచాను. ఏదో! ఆ స్కూలు ఫైనలు దాటుతే చాలు. కాని! ఒక్కమాట. ఈ విషయము మన ఇద్దరిలోనే ఉండవలయును. చదువంతయూ పూర్తిఅయి, వివాహము జరుపబోవు వరకున్నూ ఎవ్వరికీ, తెలియనీయకండి'' అన్నారు ప్రసాదరావుగారు.

ఈ మాటలన్నియూ శారదమ్మగారు వినుచునే యుండెను. కాని, ఇది అంతయూ ఒక కలగా యుండెను. ఏనాడున్నూ, కలలోగూడా అనుకోలేదు. తన కుమారునకు ఇంత భాగ్యము లభించునని ఏనాడున్నూ, కలలోగూడా అనుకోలేదు. ఏమియున్నూ మాట్లాడలేక పోయెను. చివరకు ''సరే'' అనే ఒక్కమాట మాత్రమూ అనగల్గెను.

''రామూ చదువుయందు వృద్ధిలోనికి వచ్చుచున్నాడు. ఇంటరుమీడియేటు కాలేజీ ప్రథమముడుగా కృతార్థుడయినాడు. బి. యస్. సి. అందు ప్రవేశపెట్టారు. అది కూడా మంచి మార్కులతో కృతార్థుడయినాడు. ప్రసాదరావుగారికి కావలసినంత ధనము ఏమయిననూ చెప్పించగలడు. రామూను, కలకత్తా విశ్వవిద్యాలయమునకు పంపదలచెను, ధరఖాస్తు పెట్టించారు.

రామూ కలకత్తా విద్యాభ్యాసముకై వెడలుచూ ముందుగా తల్లిగారికి, తర్వాత పెద్దవారగు ప్రసాదరావుగారికి నమస్కరించెను. పాపం! శారదమ్మగారు కుమారుని వదలి ఎన్నడునూ ఉండలేదు. కన్నీటితో కుమారుని సాగనంపెను.

మూడు దినములు గడచినవి. నాల్గవ రోజు ఉదయమున ప్రసాదరావుగారు కాఫీ త్రాగుచూ కూర్చుండిరి. ఇంతలో రేడియోయందు కలకత్తా మెయిలుకు ఘోర ప్రమాదము సంభవించిందని వార్తవచ్చెను. అందులో ఇరువది ఇద్దరి దుర్మరణం, మిగతవారికి గాయములు అనికూడా వెలువడెను. ప్రసాదరావుగారు త్రాగుచున్న గ్లాసు దానంతట అది క్రిందపడి పగిలిపోయినది. ప్రసాదరావుగారికి కాళ్ళు చేతులూ ఆడలేదు.

ఈ వార్త వినగానే శారదమ్మకు ఒకటే ఏడ్పు. మధ్యాహ్నం 12 గం॥ లాయెను. ఇంతలో టెలిగ్రాం వచ్చినది. అందులో ''రామూరావు మరణం'' అని యున్నది.

ఈ వార్త వినుచునే శారదమ్మగారికి మాటా పలుకూ లేకుండా పోయినది. ఇంకేముంది. ఆ మహాతల్లి కుమారుని వదలి ఉండలేదాయెను! తనుకూడా ఈలోకం వదలివేసి కుమారుని వద్దకే ప్రయాణమయి పోయినది. అప్పుడే రేడియోనందు ''గాలి మేడలూ, గారడికాగా'' అనే ఘంటసాల వారు పాడినపాట వినవచ్చుచుండెను.

# విద్యార్థుల నైతిక పునరుద్ధరణ, విద్యా సంస్థల కర్తవ్యం

డాక్టర్ రాధాకమల్ ముఖర్జీ

---

కొన్ని సంవత్సరాలనుంచీ విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలలోను, అశాంతి అనేది ఒక అంటు వ్యాధివలె పరిణమించింది. అధ్యాపకులు, పరీక్షాధికారులు, విద్యా సంస్థలపట్ల నిరసనగా సమూహ ప్రదర్శనలు, ప్రత్యక్షచర్యలు, క్రమశిక్షణారహితమైన ప్రవర్తన, యీ అశాంతికి దారితీశాయి. ఈ చర్యలన్నీ విద్యార్థుల నైతికశక్తిని క్షీణింపచేస్తున్నందున, యువజనులు భవిష్యత్ పౌరసత్వ బాధ్యతలను నిర్వహించడానికి తగినట్టుగా విద్యాసంస్థలు శిక్షణ యివ్వడంలేదని దేశంలోని విద్యావేత్తలు, పరిపాలనా దక్షులు భయపడుచున్నారు.

విద్యార్థులలో క్రమశిక్షణ, నైతికశక్తి, కళాశాలలోను, విశ్వ విద్యాలయాలలోని సాంఘిక భద్రతల మీద ఆధారపడివుంటాయి. ఉన్నతాదర్శాలు, ఉన్నతమైన నైతిక విలువలు వుంటేనే పైరెండు ఆచరణలో సాధ్యమౌతాయి. విజ్ఞాన తృష్ణ, పరిశోధనా కృషి అధ్యాపకులలో సన్నగిలితే, ఆ విశ్వవిద్యాలయం, విద్యానిలయమే కాదు - కంచేచేనుమేస్తే, విద్యార్థులలో భక్తి, విధేయతలు ఎక్కడినుంచి వస్తాయి ? విద్యార్థి సమూహాలు ఎంత అల్లరిచేసినా, సచ్ఛీలము, ఉన్నత విద్యాసంపదగల అధ్యాపకుడు వారిని అదుపులోకి తెచ్చి, వారిని మంచి మార్గంలోకి తీసుకురాగలరు. అందువల్ల విజ్ఞానకృషి, ఉత్తమ ఆదర్శాలు అత్యున్నతస్థాయిలో అమలు జరిగితే, విద్యార్థులలో క్రమశిక్షణ, విద్యా ప్రావీణ్యం తప్పక పెంపొందగలవు. అంతకుమించి వేరుమార్గంలేదు.

భారతదేశంలోని విద్యాసంస్థలలో ఎక్కువభాగం అనేక రకాల క్రిందట పశ్చిమ యూరప్‌లోగల పబ్లిక్ స్కూళ్ల పద్ధతిలో నెలకొల్పబడినవే. ఆ పబ్లిక్ స్కూళ్ల ప్రధాన లక్ష్యం శిక్షణ పొందిన సివిల్ ఉద్యోగులను, పరిపాలనా దక్షులను తయారు చేయ్యడమే. ఆ విధంగా కొన్ని దశాబ్దాలకు గడచిన తర్వాత పరిపాలకశాఖ ఉద్యోగులు, ఆఫీసర్లు, వివిధ రకాల గుమాస్తాల అవసరం విపరీతంగా పెరిగింది. పెరుగుతూన్న అవసరాల మేరకు, విశ్వ విద్యాలయాలు, కళాశాలలుకూడా ఉద్యోగులను గుమాస్తాలను తయారుచేసే యంత్రాగారాలుగా మారిపోయాయిగాని విద్యా ప్రావీణ్యంపట్ల తమ దృష్టిని కేంద్రీకరించలేకపోయాయి.

## విద్యా సంస్థలలో రద్దీ

ఈ మార్పులతోబాటు విశ్వ విద్యాలయాలలోను, కళాశాలలోను విద్యార్థులు రద్దీ ఎక్కువైపోయింది. ఆ తొక్కిడిలో విద్యార్థులు, అధ్యాపకులు సన్నిహిత సంబంధాలు ఏర్పర్చుకోడానికి అవకాశాలు తగ్గిపోయాయి. క్లాసు గదులలోను, ప్రయోగమందిరాలలోను విద్యార్థులయొక్క దినచర్య నిర్జీవయంత్రంలాగ నడిచిపోవడం ప్రారంభమైనది. ఇంతేగాక విద్యార్థులు వరుసగా అనేక పరీక్షలకు హడావుడిగా తయారుకావల్సి వున్నందున వారిలో లేనిపోని అనుమానాలు, భయాలు వృద్ధికాజొచ్చాయి. ఆ అసంతృప్తే విద్యార్థుల అక్రమ ప్రవర్తనకు, సమ్మెలకు, క్రమంగా దారితీసింది. వాస్తవిక పరిస్థితులను గుర్తించలేక, అందని ఆదర్శాలవైపు విద్యార్థుల దృష్టి మళ్లింది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, విశ్వ విద్యాలయాలు, కళాశాలలయొక్క ఆదర్శాలకు, లక్ష్యాలకూ, సోషలిస్టు సాంఘిక వ్యవస్థయొక్క ఆదర్శాలను పరస్పర వైరుధ్యం ఏర్పడింది. నేటి విశ్వ విద్యాలయ కాల వ్యతిరేక జీవిత విధానాలకు, తారుమారైన విలువలకు పట్టుగొమ్మలైనాయి. తత్ఫలితంగా మేధావంతులకు, ప్రజాసామాన్యం మధ్య ఒక పెద్ద అగాధం ఏర్పడింది. సాంఘిక సమానత్వం, న్యాయ నిర్వహణ, భాగస్వామ్యం నూతన ఆర్థిక సాంఘిక వ్యవస్థకు మణిపూసల వంటివని ప్రశంసిస్తూండగా, ఈ నాడు మన విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలోను, వర్గవైషమ్యం, సాంఘిక

అసమానత్వాలు విశేషంగా పెరిగిపోయాయి. అట్టి వైర, రద్ది పరిస్థితులు మన సాంఘిక లక్ష్యాలకే చెముపు కలిగిస్తున్నాయి. అంతేగాక క్రమశిక్షణ విషయంలో విద్యా సంస్థలు వెలిబుచ్చే అభిప్రాయాలను ప్రజలు విశ్వసించరు.

## తక్షణ కర్తవ్యం

విద్యార్థుల నైతిక పునరుద్ధరణకు, వారిలో క్రమశిక్షణను పెంపొందించడానికి, విశ్వ విద్యాలయాలలో సాహిత్య, వైజ్ఞానిక, సాంస్కృతిక సంఘాలను పెంపొందించి, విశ్వ విద్యాలయ వ్యవహారాలలో సముచితమైన పాత్రను నిర్వహించడానికి వారికి అవకాశాలు కల్పించి, అతిక్లిష్ట సాంఘిక సిద్ధాంతాలను వాస్తవిక దృష్టితో చర్చించడానికి సదుపాయాలను కలిగించి, శక్తిమంతమైన ట్యుటోరియల్ పద్ధతిని ప్రవేశపెట్టి కృషిసాగించడం తక్షణ కర్తవ్యం.

సాంస్కృతిక, విద్యా కార్యక్రమాలలో పాల్గొనడానికి పరిపూర్ణ అవకాశాలను కల్పించి, వివిధరకాల ఆటలలోను, వ్యాయామ క్రీడలలోను వారికి ప్రోత్సాహం కల్పించి, సంఘపురోభివృద్ధి కృషిని వారికి అలవరిస్తే విద్యార్థులకు మూక మనస్తత్వం ఎన్నడూ అలవడదు.

స్వార్థ రాజకీయాలకు, పరోక్ష ప్రచారాలకు, శుష్కనినాదాల అతీతమైనటువంటి, ప్రజాస్వామ్య బద్ధమైన ప్రజాభిప్రాయాన్ని పెంపొందించి ఆచరణలోకి తేవాలంటే, వివిధరాజకీయ పక్షాల విధానాలను నిష్పక్షపాతంగా చర్చించడానికి విశ్వ విద్యాలయాలు అవకాశం కల్పించాలి.

ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యా, విశ్వ విద్యాలయాలలోని కోర్సులను సంస్కరించి, విద్యార్థుల ఉద్యోగ తాపత్రయం ఉన్నత విద్యా సముపార్జనకు భంగం కలిగించకుండా, విద్యార్థులు ఉన్మాద పూరితమైన మూక మనస్తత్వానికి లోనుకాకుండా, తగిన రక్షణలు కల్పించాలి. అట్టి ఆర్థిక, విద్యా విషయిక పునరుజ్జీవనాన్ని సాధించనంతవరకూ మన విశ్వ విద్యాలయాలు, కళాశాలలు అశాంతి, అక్రమ ప్రవర్తన, ఉద్రేక చర్యలకు గురికాక తప్పదు.

---

# ఆకెళ్ల సూర్యనారాయణరాయ మహిళా భవనం

బురుజుపేట, విశాఖపట్నం 15-8-1956

విశాఖపట్టణ మహిళాభవనమునందు ఆగష్టు 15-వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవము డి. ఎమ్. ఓ. గారి సతీమణి శ్రీమతి సీతాదేవిగారి అధ్యక్షతన జరుపబడెను. అధ్యక్షురాలిచే పతాకోత్సవము జరుపబడెను. సభకు పలువురు పురస్త్రీలు, సభ్యురాండ్రు విచ్చేసిరి. సభ్యురాలైన శ్రీమతి లీలావతమ్మగారు స్వాతంత్రియ దినోత్సవము గురించి మాట్లాడిరి. ఈ సందర్భములో సుమారు నాలుగు వందలమంది బీదలకు అన్నదానముచేసి, సభ్యురాండ్రచే బట్టలు పంచిపెట్టబడెను. జనగణమణ మంగళ గీతముతో సభ జయప్రదముగా ముగింపబడెను.

ఇట్లు,
అయ్యగారి సింహాద్రమ్మ
కోశాధికారిణి

## శ్రీ బండి శ్రీ హరిరావునాయుడుగారి ఉపన్యాసము

(456 పేజి తరువాయి)

వేంకటేశ్వరస్వామి కటాక్షమువల్ల వారికమీషనరుగా పనిచేయుటచేత యీభవనమునకు మొదటిసారి 5000 రూపాయలు తిరుపతి దేవస్థానమువారి యొద్దనుండి సంపాదించి శ్రీ వెలగపూడి రామకృష్ణగారు యుద్ధానంతరము వేలములో కొని తిరువత్తియూర్ ఫ్యాక్టరీ వద్ద ఉంచిన తలుపులు, కిటికీలు, దూలములు మొదలైనవాటిలో కొన్నింటిని వారినడిగి తీసికొని 16000 రూపాయలతో ఇప్పుడు మనము కూర్చున్న భవనమును కట్టించితిమి. ఇంకను ఎలిమెంటరీస్కూలు విద్యార్థులసంఖ్య అధికమగుటచేత నిరుడు మరల శ్రీ వేంకటేశ్వరస్వామి తరఫు కమిటీని అడిగి శ్రీ పంచాగ్నుల సూర్యనారాయణగారి ప్రభృతుల సహాయము వలన 5000 రూపాయలు సంపాదించితిమి. ఆమొత్తము కంట్రాక్టరు శ్రీ సత్యనారాయణరెడ్డిగారికిచ్చి ఎక్కువ తక్కువలు వారు పెట్టుకొను పద్ధతిన ఈరోజున ప్రారంభోత్సవము జరుపుచున్న హాలును నిర్మింపగలిగితిమి. మొదటి హాలుకు, మిడిల్ స్కూలుకు ఇప్పుడు కట్టించినహాలుకు కావలసినవిద్యుద్దీప సౌకర్యములను శ్రీ ఐ. ఎస్. రావుగారు ఉచితముగా చేసిరి. పైవారందరికి మా కేసరీసంఘము తరఫున నా ధన్యవాదములు. ఇప్పటికి త్యాగరాయనగరములోని కేసరి తెలుగుస్కూళ్ళఆస్తి ఖరీదు దాదాపు 3 లక్షలరూపాయలు. ఈక్రొత్తగా నిర్మించిన హాలుకు ప్రారంభోత్సవముచేయు శ్రీరామనాథంబాబుగారి తండ్రి శ్రీయార్లగడ్డ రంగనాయకులుగారు చెన్నపట్టణములో నూరు సంవత్సరములక్రిందటినుండి కోస్తా ఓడల వ్యాపారముచేసి, ఉన్నతస్థితికి వచ్చినవారు. వారికి ఇప్పుడువయస్సు 84 సం॥లు. శ్రీ కేసరిగారి సమకాలికులు. శ్రీ కేసరిగారివలెనే విద్యాభివృద్ధికి మూడులక్షలు నిధిని కల్పించి ఆంధ్ర యూనివర్సిటీకి 25000 రూపాయలు, బెజవాడ, తెనాలి, నిడుబ్రోలు, చీరాల కాలేజీలకు చెరి పదివేలు రూపాయ లిచ్చినారు.... వారి స్వగ్రామముదగ్గర పరచూరులో ఒక లక్షరూపాయల మూలధనముతో శ్రీ యార్లగడ్డ రామన్ననాయుడు హైస్కూలును నడుపుచున్నారు. వారిపుడు వృద్ధులగుటచేత వారి కుమారుడు శ్రీ రామనాథంబాబుగారే పైచెప్పిన విద్యాసంస్థలకు భూరివిరాళములిచ్చి పరచూరులోని హైస్కూలును నడిపించుచున్నారు. వారికుటుంబము చెన్నపట్నములో యెరుగనివారు లేరు. వారు ఈభవనమునకు ప్రారంభోత్సవము చేయుటకు కోరిన వెంటనే ఒప్పుకొనుట మా యదృష్టము. దానితో పాటు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అధ్యక్షులుగా వచ్చుటకు ఒప్పుకొనుట మరీ మాఅదృష్టము. వారు కూడ స్వయంకృషివల్ల శ్రీమంతులై, సంపాదించిన సొమ్ములో కొంతఅయినా ఇచ్చి విద్యాభివృద్ధికి తోడ్పడవలెనని వూహ గలవారు. వారు 25000 రూపాయలు ఆంధ్రయూనివర్సిటీకి భూరివిరాళముగా యిస్తున్నారని తెలిసికొనుటచేత మరీ శ్రీ కేసరిగారి యుదారభావములు గలవారని నాకు యెంతో సంతోషముగలిగి వారిని అధ్యక్షత వహించమని కోరితిని. వెంటనే ఒప్పుకొన్నారు. దానిలో విశిష్టత యేమిటంటే, సినిమా ఆక్టరగుటయు వారిదికాదు. వారి షూటింగులకు రాత్రి, పగలుఅంటూ లేదు. నిద్రాహారములు వుంటవా అని నాసందేహము—వద్దంటే డబ్బు యెంతవచ్చినా Physical గా వారికష్టము ఇంతా అంతా కాదు. అందుచేత అడిగిన వెంటనే ఒప్పుకొనుట నాకు చాలా సంతోషము నిచ్చినది.—ఇదిగాక శ్రీ నాగేశ్వరరావుగారి విషయములో నాకు సంతోషము గలిగించేసంగతి ఇంకొకటి యున్నది. నేను సర్కారు ఉద్యోగములో మొట్టమొదట 15 రూపాయలలో ప్రవేశించినా 10 సంవత్సరముల సర్వీసు కాకుండగానే 32 సం॥ల వయస్సునకే దైవకృపవల్ల డిప్యూటీ కలక్టరు అయినాను. 1929 సం॥లో మొట్టమొదట డిప్యూటీ కలక్టరుగా గుడివాడ డివిజనుకు నియమింపబడి 3 సం॥లు దాదాపు ఆ డివిజనులో పని చేసితిని. ఆ మూడు సంవత్సరములలో 3 మిడిల్ స్కూళ్ళను పెట్టించ గలిగితిని. అవి యిప్పుడు హైస్కూళ్ళు అయినవి.—శ్రీ నాగేశ్వరరావుగారితో జాయింటు ప్రొడ్యూసరుగా పని చేయుచున్న శ్రీ దుక్కిపాటి మధుసూధనరావుగారు బాల్యములో చదువుకొన్నారని వినుటకు చాలా



7

సంతోషము.—వాటిలో ఒకటయిన ముదినేపల్లి శ్రీహరి బోర్డుహైస్కూలులో—ప్రజలకు కావలసిన సౌకర్యము లెన్నియో ఇప్పటి కమ్యూనిటీ ప్రాజక్టుల ధోరణిలో చాలా చేయగలిగితినని నాగర్వము. దానికి మీరు నన్ను క్షమింతురుగాక. అందుచేత గుడివాడ కైకలూరు తాలూకా ప్రజలంటే నాకు చాలా ప్రేమ.—శ్రీ నాగేశ్వరరావుగారి స్వస్థానము గుడివాడ తాలూకాలో ఒక చిన్నగ్రామమయిన రామాపురము. అక్కడనుండి చెన్నపట్టణము వంటి మహా పట్టణమునకువచ్చి, ఇంత పేరు ప్రఖ్యాతి గడించినారని నాకు చాలా సంతోషము. వారియెడల నాకు యెక్కువ మర్యాద. మనమందరము గర్వపడవలసిన విషయము. మూడవసంగతి యేమనగా త్యాగరాయనగరములోని మా తెలుగు స్కూళ్ళు Holly Wood Schools అని నేను పేరు పెట్టినాను. దాదాపుగా వాటిలో చదువు పిల్లల తల్లిదండ్రులు ఏవిధముగానో సినిమావృత్తితో సంబంధమున్నవారే. వారిలో చాలామంది బహు బీదవాళ్లు. కొంతమంది మిడిల్ క్లాసు పిల్లలు—భాగ్యవంతుల పిల్లలు తక్కువ. అటువంటి పిల్లలుగల సంస్థను ప్రఖ్యాత సినిమా నటీనటులు అభిమానము తప్పక చూపవలసి వుంటుందని నా విన్నపము. యెందుకనగా ప్రఖ్యాత నటీనటులతో మాత్రము ఒక సినిమా తయారుచేయగలరా? శ్రీమతులు కన్నాంబ, అంజలీదేవి ఇద్దరు వరలక్ష్మిగార్లు భానుమతిగార్లు శ్రీయుతులు ఎన్. టి. రామారావు, ఎ. నాగేశ్వరరావు ప్రభృతులతో మాత్రమే ప్రొడ్యూసర్సు ఒక సినిమాను తయారుచేయగలరా? చేయలేరు. చిన్న పాత్రలు, కవులు, టెక్నీషియన్సులు మొదలైనవారి సహాయముకూడ కావలెను—అనగా అందరూ Co-operate చేస్తేనే ఏ సంస్థఅయినా పైకివస్తుంది. అందుచేత ఈ రోజున శ్రీ నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించుటవల్ల సినిమారంగంలోని చిన్న పాత్రల వారియెడల సానుభూతి చూపించినారని నాకు యెంతో సంతోషము. అందుకు మనమందరము వారిని అభినందించవలెను. రోజులు మారాయ్. ప్రపంచములోని స్థితిగతులు మనము అనుకోనంత త్వరగా మారిపోతున్నవి. Socialistic and Welfare state కు ప్రాముఖ్యత యెక్కువ అవుతున్నది. కొలది సంవత్సరములలో ఆదాయపుపన్ను మూలముననేగాక ప్రజాస్వామికమైన పరిపాలనా పద్ధతుల మూలముగాకూడా మన డబ్బంతా మనకే దక్కుతుందని నమ్మకములేదు. గనుక దీపమున్నప్పుడే సత్కార్యములకు మన ఆర్జనలో కొంత అయినా ఖర్చుచేయుమని నా సలహా. దానివలన మన పేర్లు స్థిరముగానూ ఆచంద్రార్కముగాను వుంటవి. దీనికి ఒక ఉదాహరణ: కీ॥ శే॥ బెంగుళూరు నాగరత్నమ్మగారు మా సంస్థకు 2000 రూపాయలు ఇచ్చినారు.

ఇదివరలో మా యెలిమెంటరీ స్కూలుకు భయములేదు. పిల్లల సంఖ్యనుబట్టి యెంతమంది ఉపాధ్యాయులుంటే వారి జీతమంతా సర్కారువారు భరిస్తారని చెప్పినారు.

మిడిల్ స్కూలుకు మాత్రము సగటు ఖర్చులో మూడువంతులలో రెండువంతులు మాత్రమే సర్కారు గ్రాంటుక్రింద యిస్తారు. మిగతా నష్టము మేనేజ్‌మెంటు భరించవలసి యుంటుంది. అరవ పిల్లలను చేర్చుకొని అరవములో విద్య చెప్పితే నష్టములేదు. కాని అటులచేయుట మా కేసరి విద్యాసంఘమునకు యేమియు ఇష్టములేదు. ఇదివరలో Triplicane High School కు కీ॥ శే॥ విజయనగరం మహారాజా శ్రీ శ్రీ శ్రీ అలక్నారాయణ గజపతి మహారాజులుంగారు యెంతో యెక్కువసొమ్ము యిచ్చినారు. కాని యిప్పుడు ఆ సంస్థలో మన తెలుగుపిల్లలకు స్థానము లేదు. అలాగుననే అనేక సంస్థలు మన తెనుగువారు యిచ్చిన డబ్బువల్ల మొట్టమొదట స్థాపించబడినా యిప్పుడు తెలుగువారికి ప్రస్తుత రాజకీయ ప్రచారముల బట్టి, స్థానములేదు. తప్పనిసరి అయితేగాని అరవపిల్లలను చేర్చుకొనుట మంచిదికాదు. గాని తెలుగుపిల్లలు ఈ ప్రాంతములో మరీ యెక్కువగా లేకపోవుటచేత నష్టమురాక తప్పదు. ఆ నష్టము సాలీనా భరించుటకు మార్గము మనము వెతుకవలయును. మిడిల్ స్కూలుకు 9 గదులు గలవు. 4 గదులకు శ్రీ పి. గోవిందరాజులు

నాయుడుగారు, నాకు చిన్నతనములో విద్యాసహాయ మొనర్చిన శ్రీ గెడాగెరటయ్యగారి కుమార్తె, శ్రీ. శే. బారిష్టరు కానుమిల్లి జగన్నాథరాయుడుగారి భార్య శ్రీమతి వెంకటనరసమ్మగారు, శ్రీ కంట్రాక్టరు సత్యనారాయణరెడ్డిగారు, శ్రీ సి. యస్. లోకనాథ మదలియారుగారు చెరియొక 4,000 రూ॥లకు తక్కువగాకుండా యిచ్చినందువలన వారిపేర్లు ఆయాగదులకు ఉంచబడినవి. ఆ గదులలో వారి ఫోటోలు కూడా వుంచబడినవి. తక్కిన గదులకు యెవరైనా గది వక్కంటికి రు. 4,000 లకు తక్కువ గాకుండా విరాళము యిచ్చినట్లైతే వారిపేర్లు ఆ గదులకుపెట్టి, వారి ఫోటోలతో ఆ గదులు అలంకరించెదము. అట్టి వుదారులు 4 గురు లేక 5 గురు లభించితేగాని మిడిల్ స్కూలు తట్టుకోలేదు. శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరిగారు ఇటీవలనే కారంచేడులో వారి తండ్రిగారి పేరిట ఒక High School కు 50,000 రూపాయలు యిచ్చి స్థాపించి వారి ఔదార్యమును వెల్లడించిరి—వారి అబ్బాయి మా మిడిల్ స్కూలులో 3-వ ఫారము ప్యాసుఅయి, ఇప్పుడు 4-వఫారము Kesari High School లో చదువుతున్నాడు. ఒకగదికి వారి పేరట డబ్బు ఇమ్మని కోరినాము. ఇస్తారని మా ఆశ. తక్కిన గదులకుకూడా ఉదారులు ముందుకు వస్తారని ఆశిస్తున్నాము. అందరూ తలాఒక నాలుగు వేల రూపాయలు ఇవ్వలేరుగనుక పైతరగతిలో ఉన్న సినిమా ప్రొడ్యూసర్సు, డైరక్టర్లు, సినిమా ఆక్టర్లు, కవులు తలాఒక 1000 లేక వారివారి శక్తికొలదియో చందాలు వేసికొని ఒక School Bus కొని యిస్తే పిల్లలకు యెక్కువ సౌకర్యములు కలిగించగలము. ఆ బస్సు హైస్కూలుకు, మిడిల్ స్కూలుకు, ఎలిమెంటరీ స్కూలుకు కూడా పనికివస్తుంది.

చాలామంది పిల్లల తల్లిదండ్రులు 4-వ ఫారము పెట్టమని అడుగుచున్నారు. కాని, 'ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి ఎక్కుట యెట్లూ!' హైస్కూలు నిర్వహించుటకు తగిన డబ్బు యే మహానుభావులైనా యిచ్చినట్లైతే త్యాగరాయ రోడ్డుమీదకు బాగా కనపడేలాగున మా స్థలములో, మా యాజమాన్యమున వారి పేరిట హైస్కూలు పెట్టుటకు ఆలోచించుచున్నాము.

ఇంతకన్నా నేను మనవిచేయలేను. తక్కిన పని మీ దయార్ద్రహృదయమునుబట్టి యుంటుంది.—ఎక్కువగా మీ కాలము వ్యయపెట్టినందుకు క్షమించండి.—ఇంతతో విరమించుచూ—శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారిని అధ్యక్షత వహించమనియు, శ్రీ యార్లగడ్డ రామనాథబాబుగారిని హాలుకు ప్రారంభోత్సవము చేయమనియు కోరుచున్నాను.

జైహింద్ !




# విజయ - భారతి

కానాధిభొట్ల సుబ్బారావుగారు

(జూలై సంచిక తరువాయి)

—(०)—

ఇలా వుండగా యింకొక వార్తను తెచ్చాడు. కొండ ప్రక్క ఎవరో పడివున్నాడని మకరందు అతని దగ్గరకు వెళ్ళాడు. అతడు మూల్గుతూ తన వృత్తాంత మంతా చెప్పి తన భార్యయయిన భారతిని ఎత్తుకు వచ్చాడనీ, తాను వేటకటానికి వచ్చాననీ తన పేరు రాజ్యవర్ధనుడనీ ఇంతలో రాక్షసి కనుక్కొని తనను చంపబోయాడనీ, కాని పెద్దగా అరుస్తూ రాక్షసి పరుగెత్తిందనీ చెప్పాడు. మకరంద్ అతనిని ఆ శరీరము దగ్గరకు తీసుకువెళ్ళి "యీమే నా నీ భార్య!" అని అడిగాడు. అవునంటూ బావురుమన్నాడు. విషయమంతా తరువాత చూద్దాం అనుకొని అందరూ 'భారతి' దేహాన్ని బుజాన వేసుకొని ముని దగ్గరకు వచ్చారు. భారతి సజీవంగా వస్తుందని ఎదురు చూస్తున్న విజయ శవాన్ని చూడగానే ఒక్కసారి మొదలు నరికిన అరటిచెట్టులా పడి స్పృహతప్పి పడిపోయింది.

## 6

ముని విషయమంతా గ్రహించి ఆమెను బ్రతికింప వలెనని నిశ్చయించుకున్నాడు. వెంటనే ఆయన తన కళ్ళల్లోనుండి అమృత బిందువులను రప్పించి ఆమె దేహంపై చల్లాడు. ఆమె నిద్రమేల్కొనినవిధంగా లేచి కూర్చుంది. విజయా, భారతీలు ఒకరినొకరు కౌగలించుకొని బావురుమన్నారు. ఎంతకాలానికి కలుసుకున్నాం అని మనసారా ఆనందించారు.

తరువాత 'భారతి' రాక్షసిగా మారుటకు కారణ మడిగారు అందరూను. ఆమె యిలా చెప్పసాగింది.

"ఆనాడు నన్ను ఎత్తుకువచ్చిన దగ్గర్నుండే పెళ్ళి చేసుకోమని బలవంతం చేయసాగాడు. నేను ఒప్పుకో లేదు. తిట్టాను. ఇలా కొంతకాలం గడిచింది. ఒకసారి అమాంతం మీదపడబోయాడు. వెంటనే బుద్ధి లేదా? అంటూ వుమ్మేశాను. వాడు తారాపథాని కెగిరి నన్నే వుమ్మేస్తావా, చూడు నీపని ఏంచేస్తానో" అని నా ప్రాణం ఒక శిలలో బంధించి రాక్షసిని చేశాడు. అప్పటినుంచీ యిలాగే వున్నాను. ఇప్పుడు యీ మహనీయునిచే రక్షింపబడ్డాను.

"నా ప్రభావంకాదు. అమృతఖడ్గ ప్రభావము" అని సవరించాడు మకరంద్.

ముని చిరునవ్వు నవ్వాడు.

వారందరూ మునివద్ద సెలవుతీసుకున్నారు. నూతన యువకుడు స్వదేశానికి వెళ్ళాడు. విజయ, భారతీ, మకరంద్ రాజ్యవర్ధన్‌లు ప్రయాణం సాగించారు. ఆనందరాజ్యము చేరుకోగానే సమరసేనుడు శీలవతీ తమతమ కూతుండ్రను కౌగలించుకొని ఆనంద భాష్పాలు రాల్చారు. తమ కూతుండ్రను రక్షించిన మకరంద్‌ను మెచ్చుకున్నారు.

ఆ తరువాత వారు ఆకాశమంత, పందిరి భూదేవంత అరుగూ వేసి నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విజయా మకరంద్ లకు, భారతీ రాజ్యవర్ధనులకూ వివాహం జరిపించి తమకు పుత్రసంతానం లేనందున చెరిసగం రాజ్యం యిచ్చారు. భారతీ రాజ్యవర్ధనులు తమ దేశానికి వెళ్ళారు. మకరంద్ క్రొత్త భార్యతో విశాలరాజ్యంలో అడుగుపెట్టాడు. తమకు శ్రమ లేకండా తగిన భార్యను తెచ్చుకున్నందుకు ఆతని తల్లి దండ్రులు మురిసిపోయారు.

రెండు రాజ్యాలనూ పాలిస్తూ మకరంద్ విజయతో హాయిగా ఉన్నాడు. వారి అన్యోన్య దాంపత్యాల్ని చూచి తలిదండ్రులు సంతోషించారు. "సుఖంగా ఉండండి. పుత్ర పౌత్రాభివృద్ధి రస్తు" అని దీవించారు తల్లిదండ్రులు.

—(౦)—

## సంతత సౌభాగ్యవతీ భవ!

మా సోదరి చి॥ సౌ॥ వసంతకుమారి మా కళ్లముందు ఆడుతూ పాడుతూ అల్లారుముద్దుగా పెరిగి, సంగీత సాహిత్యాలలో సరస్వతిగా రూపొంది, పూజ్య బాబు కేసరిగారు సమకూర్చిన ఐశ్వర్య సౌభాగ్యములతోబాటు మలబార్ వాస్తవ్యుడు శ్రీ కే. నారాయణమీనన్‌ను గురువాయూర్ భగవత్సన్నిధానంలో వివాహమాడి ప్రప్రథమంగా మద్రాసుకు తండ్రిగారి యింటికి వచ్చిన సందర్భము బంధు మిత్రులకు పర్వదినమయింది.

మా సోదరి వైవాహిక జీవితము ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లుతూ అన్యోన్యానురాగయుక్తమయినదిగా పరమేశ్వరుడు రూపొందించాలని మా ప్రార్థన.

శ్రీ నారాయణమీనన్ సతీ సమేతంగా పారమార్థికచింత, ఉదార హృదయములతో తన మన అనే బంధు మిత్రుల ఆదరాభిమానములకు, ఆశీస్సులకు నిరంతరము పాత్రులు కావాలని మా ఆశ.

నూతన దంపతులకు మా అనురాగపూరితమయిన ఆశీస్సులు!




**జీవనతరంగం (1, 2 భాగములు): ప్రచురణ కర్తలు దేశోద్ధారక గ్రంథమాల, 3-5. 1027 నారాయణగూడ, హైదరాబాదు. వెల ప్రతి 1కి రు. 1-12-0. సభ్యులకు రు. 1-8-0**

ఈ రెండు పుస్తకాలలో మొదటి భాగమునందు ఎనిమిది, రెండవ భాగంలో నేడు ఏకాంక దృశ్య నాటికలున్నవి. ఇవియన్నియు దేనికది తెలంగాణా సుప్రసిద్ధ రచయితలచే రచింపబడినవి.

ప్రతియొక్క నాటిక వినోద విజ్ఞానములతోబాటు సంఘములోని అనుభవాలను, వాస్తవిక పరిస్థితులను వ్యక్తపరుస్తున్న యితివృత్తాలు. రచన సరళంగా సాగి దృశ్యనాటికలుగా ప్రేక్షకులలో ఉత్సాహ ఆసక్తులను ప్రేరేపించునవిగా రూపొందినవి. పాఠకులు యీ విషయమును స్వయంగా గుర్తించగలరు. అభ్యుదయ నాటక సమాజములు ప్రదర్శించుటకు, అభ్యుదయ నాటక రచయితలకు మార్గదర్శకముగా నుండగలవు.

ఈ రెండు పుస్తకాలు విశేషంగా నాటక కళాభిమానుల, ఆరాధకుల అభిమాన పాత్రముకా గలవని మా నమ్మకము.

**సమాగమము: శ్రీమతి వసంతకుమారీదేవి, సాహితీసమితి, రేపల్లె. వెల రు. 0-12-0**

ఇది చిన్న పద్యకావ్యము. మహాయానకథానుసారముగా గౌతమ బుద్ధుని చరిత్రమందు వివరించబడినది గౌతముని భార్య యశోధరాదేవి పరధ్యానపు పూర్వస్మృతులుగా రూపొందిన యిందలి పద్యములు మనోజ్ఞంగ నున్నవి. ఈ కవిత ధోరణి కొంత నవీనతను చూపుతూ, భావరసములతో నొప్పుచున్నది.

ఇందులోని కవయిత్రి కవితానైపుణ్యముతోబాటు ఊహాశక్తి సయితం ప్రశంసించ తగినది.

అనర్గళంగా సాగిన ఈ పద్య రచన సరళంగానుండుటేగాక సలక్షణాన్వితముగా ఉత్తమ కవితల శ్రేణి నందుకున్నది.

**పూజా పుష్పాలు: శ్రీమతి పిల్లలమర్రి సుశీల. శారదాపీఠము, గుంటూరు. వెల రు. 0-12-0**

ఇందులో రచయిత్రి తన రేడియో ప్రసంగాలను, పత్రికలలో ప్రచురితమయిన రచనలనుకూర్చి పూజా పుష్పాలుగా తన భర్త జన్మదినమున భక్తి పురస్సరంగా సమర్పించిన పుస్తకం.

రచయిత్రికి పుట్టింట్లో, మెట్టిన యింట్లో సాహిత్యోపాసనకుగల అవకాశములను వినియోగించుకొని సాగించిన యీ రచనలు మహిళా లోకంలో రచనపట్ల ఆసక్తిని ప్రోత్సహిస్తున్నట్లగుపించునవిగా నున్నవి

సంగీత సాహిత్యములలో తనకుగల ప్రవేశానుభవాలు మెరుగులు తీరిన రచనలు ముందు ముందు సాగించడానికి వినియోగపడాలని మా ఆశ.

---

# సంపాదకీయములు

## కళాకారులకు ఆంధ్ర ప్రభుత్వ సత్కారము

పద్మశ్రీ స్థానం నరసింహారావు, శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడు, శ్రీ వజ్ఝల చినసీతారామ శాస్త్రి, శ్రీమతి భానుమతి గారలను ఆంధ్ర ప్రభుత్వము అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్ర దినోత్సవ సందర్భమున సత్కరింప దలచినది.

శ్రీ స్థానం నరసింహారావుగారు నాటక కళకు చేసినసేవ అపారము. ద్వారం వేంకటస్వామి నాయుడు గారు సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసులు. శ్రీ చినసీతారామ శాస్త్రిగారు ప్రసిద్ధ వ్యాకరణశాస్త్రజ్ఞులు. శ్రీమతి భానుమతి సుప్రసిద్ధ సినిమానటి మాత్రమేకాక ఆంధ్రులలో చలనచిత్ర దర్శకత్వమును వహించిన మహిళలలో ప్రథమురాలు.

ఈ సందర్భమున యీ నలుగురు కళాకారులు—ముఖ్యంగా శ్రీమతి భానుమతి అభినందనీయురాలు.

సంగీత సాహిత్యాలు నాటక రంగానికి, సినిమారంగానికి ప్రాణంవంటివి. కళలు వ్యాప్తిచెంది వర్ధిల్ల డానికి కళాకారుల కృషి, ఉత్సాహము, సహాయ సహకారము లత్యవసరము. వానికొరకై యిట్టి సత్కారం సన్మానములను ప్రజలు, ప్రభుత్వముకూడ చేస్తుండాలి.

## రేడియో ధార్మిక శక్తి తెచ్చిపెట్టే అనర్థాలు

అణ్వస్త్రప్రాటవం పరీక్షవల్ల జనించే రేడియో ధార్మిక శక్తి సోకినందువలన దయ్యం బిడ్డలు, మంద బుద్ధులు జన్మించే అవకాశ మున్నదని డాక్టరు యస్. బి. రాయ్‌గారు ప్రకటించారు.

అణ్వస్త్రాల వినియోగం ఎంత భయానకమో యూహాతీతమైన విషయము. ఇక అణ్వస్త్రాల ప్రయోగం తరువాత మానవ పశుపక్ష్యాదులేకాక ప్రతియొక్క వస్తువుయొక్క స్వరూపము మారిపోగల ప్రమాదమున్నప్పుడు మారణాస్త్రాల నిర్మాణానికి ఒక దేశాన్ని చూచి మరొకదేశం ఎందుకు పోటీ పడుతున్నదో దురూహ్యం.

అణ్వస్త్రాల ప్రయోగించబోయేవారి ఉద్దేశమేదైనా తమ భద్రత, ఉనికిసయితం ప్రమాద భరితమని ప్రతిరాజ్యం ప్రజలు గుర్తించాలి.

## ఐక్యత పెంపొందాలి !

ఐక్యత పెంపొందడమనేది ఒకనాడు వచ్చేదికాదు. క్రమంగా మన చుట్టూ యుండే వాతావరణము ననుసరించి చిన్నతనంనుండి అలవడేది. కాబట్టి నలుగురిలో మంచిగా ఐక్యతను కూడగట్టుకొనుట శైశవము నుండే అలవడాలి.

శైశవమునుండే అలవడిన ఐక్యత జీవిత రంగంలో విశేషంగా నుపయోగపడుతుంది. తనలోని ద్వేష భావాలు, అసూయలాంటి దుర్గుణాల కతీతంగా నలుగురితో కలసి తిరుగుతూ జీవయాత్ర సాగించ కలుగుతాడు.

ఇట్టి ఐక్యత చిన్ననాటినుండే పెంపొందడానికి తల్లిదండ్రులు దోహదం చెయ్యాలి. విద్యాలయాలలో విద్యావిధానం విశేషంగా ఐక్యతను శిశువుల కలవర్చాలి.

## శ్రీ దుర్ముఖినామ సంll ర భాద్రపద, ఆశ్వయుజమాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సంll సెప్టెంబరు నెల | 16 | ఆ | ద్వా 52.53 శ్ర 48.11 త్యా 4.24 వామన జయంతి |
| | 17 | సో | త్ర 57.17 ధ 54.2 గురుమౌఢ్య రహితః |
| | 18 | మం | చ 60.10 శత 59.27 అనంత పద్మనాభ వ్రతం |
| | 19 | బు | చతు 1.4 పూభా 60.10 త్యా 4.19 |
| | 20 | గు | ○ పౌ 4.13 పూభా 3.55 త్యా 4.15 మహాలయ పక్షారంభం, ఉమా [ మహేశ్వర వ్రతం |
| | 21 | శు | కృపా 6.24 ఉభా 7.37 త్యా 4.11 |
| | 22 | శ | విది 7.28 రే 10.15 త్యాజ్యాభావః |
| | 23 | ఆ | తృ 7.21 అశ్వ 11 42 |
| | 24 | సో | చ 5.59 భ 11.55 |
| | 25 | మం | పం 3 23 ఏవ్యం 56.34 కృ 10.57 |
| | 26 | బు | స 55.6 రో 8.52 |
| | 27 | గు | అ 49.27 మృ 5.45 |
| | 28 | శు | న 43.18 ఆర్ద్రా 2.1 |
| | 29 | శ | ద 36.47 పునర్వ 53.60 త్యా 3.42 |
| | 30 | ఆ | ఏ 30.16 ఆశ్లే 48.28 |
| 1956 సంll అక్టోబరు నెల | 1 | సో | ద్వా 24.0 మఖ 44.10 ఆంధ్రరాష్ట్రోత్సవము |
| | 2 | మం | త్ర 18.12 పూఫ 40.28 త్యా 3.45 రా 27.53 త్యా 3 49, తిథిద్వయం [ మాస శివరాత్రి, గాంధీ జయంతి |
| | 3 | బు | చతు 13.7 ఉఫ 37.35 త్యా 3.53 మహాలయామావాస్య |
| | 4 | గు | ● అమా 8.57 హ 35.40 త్యా 3.57 |
| | | | **ఆశ్వయుజ మాసము** |
| | 5 | శు | శుపా 5.51 చిత్త 34.54 త్యా 4 2 శరన్నవరాత్రారంభం, కలశస్థాపనం |
| | 6 | శ | విది 3.58 స్వా 35.20 |
| | 7 | ఆ | తృ 3.20 వి 36.59 త్యా 4.12 |
| | 8 | సో | చవి 3.57 అనూ 39.48 |
| | 9 | మం | పం 5.45 జ్యే 43.40 శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి గరుడోత్సవము |
| | 10 | బు | ష 8.34 మూ 48.24 త్యా 4.19 పుస్తక రూపిణీ సరస్వత్యావాహనం |
| | 11 | గు | స 12.14 పూషా 53.53 దేవీ త్రిరాత్ర వ్రతం, శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి [ రథోత్సవము |
| | 12 | శు | అ 16.31 ఉషా 59.46 దుర్గాష్టమి |
| | 13 | శ | న 21.7 శ్ర 60.10 శూన్యతిదిః సరస్వతీపూజ |
| | 14 | ఆ | ద 28.48 శ్ర 5.47 త్యా 4.24 విజయదశమి |
| | 15 | సో | ఏ 30.16 ధ 11 40 త్యా 4.22 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు. 2-8 0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడి కాపి ఆరు అణాలు. చందాదారులు ఏ మాసము నుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

Lodhra Press, Madras-14.